# సృజన

నవంబర్ 1972

38

ఆశయ దీక్షతో ఆదర్శముకై
అమరులైన మా వీర వర్యులకు
అర్పిస్తాం యిదె జోహార్!　　　　ఇదె జోహార్!

సర్వమానవుల సమానత్వముకు
దేశదేశముల దీన జనావళి
జరిపే విప్లవ పోరాటాల్లో
త్యాగశీలముతొ హింసలపాలై
బలియై పోయిన అమర వీరులకు
విప్లవ శాల్యూట్!　　　　ఇదె జోహార్!

మీ త్యాగమ్ముల ఉత్సాహముతో
మీ సందేశపు చైతన్యంతో
విప్లవ పోరాటాల కోసమే
కలాలంకితం చేసిన వాళ్ళం
రచయితలం మేం విరసం వాళ్ళం
సగౌరవంగా చేసే శాల్యూట్　　　　విప్లవ శాల్యూట్!



# సృజన

ఆధునిక సాహిత్య వేదిక



మాసపత్రిక

38

నవంబర్ 1972

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

72 పేజీలు

1 రూపాయి

విరసం తృతీయ మహాసభల ప్రత్యేక సంచిక

విడిప్రతి: ఒక రూపాయి
అర్ధసంవత్సర చందా: ఆరు రూపాయలు
సంవత్సర చందా: పది రూపాయలు

ప్రతులకు, వివరాలకు:
సృజన
హనుమకొండ
వరంగల్ - 506001

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh Hyderabad. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam,
J. P. N. Road, Warangal-506002 (A.P.)

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

1972 నవంబర్ మాసపత్రిక 38



టావ్ చెంగ్

నవల

నా కు టు ం బ ం

ఈ సంచికలో పూర్తయి పుస్తకంగా వెలువడింది. వెల: రు. 2

# విప్లవ రచయితల సంఘం

విప్లవ రచయితల సంఘం సుత్తె-కొడవలి వర్గ రాజకీయాలను సమర్థించే కలంపార్టీ. ఏ సాహిత్యమయినా ఏదో ఒక వర్గ ప్రయోజనాల కుపయోగపడుతుందని చారిత్రకంగా, శాస్త్రీయంగా విశ్లేషించి, గ్రహించి పీడితవర్గ చైతన్యం కొరకు సాహిత్యము, కళలు సృష్టిచేయాలనే ధ్యేయంతో పుట్టింది విరసం.

పార్లమెంటరీ పార్టీలకు, శ్రామజీవుల పోరాట సంఘటనా శక్తికి ఎంత మౌలికమైన వ్యత్యాసం వున్నదో యితర రచయితల సంఘాలకు విప్లవ రచయితల సంఘానికి అంత తేడా వుండాలి.

విరసం మార్క్సియన్ సోషలిజాన్ని శాస్త్రంగానేకాక శస్త్రంగా స్వీకరించింది. పోరాట రాజకీయాల నాయకత్వాన్ని అంగీకరించింది. పాలిటిక్స్ ఎట్ కమాండ్ అనే శాస్త్రీయసత్యాన్ని నీళ్ళు నములుడులేకుండా ఒప్పుకొన్నది. విప్లవ సాహిత్యం, విప్లవ కళలు విప్లవ రాజకీయాల్లో ఒక భాగమని, విప్లవాదర్శంకోసం పోరాడే శ్రామిక చైతన్యశక్తికి సాహిత్యం బాసట కావాలని విరసం విశ్వసిస్తుంది.

చరిత్ర పరిణామ క్రమంలో యీ గడ్డమీద, అంతర్జాతీయంగా రగుల్కొన్న వర్గపోరాటాల నన్నిటినీ విరసం నిర్ద్వంద్వంగా సమర్థించింది. ఎన్నికల ఫార్సును నిర్మొహమాటంగా ఎండగట్టింది. వేతనశర్మల ఆర్థిక పోరాటాల వైఫల్యాలను ఎత్తిచూపడానికి వెనుకాడలేదు.

విరసం తప్పులు చేయలేదని కాదు. తప్పులు చేయకపోవడం కాదు— చేసిన తప్పులు శాస్త్రీయమైన అవగాహనతో ఒప్పుకొని దిద్దుకోవడం సంస్థ బలానికీ, భవిష్యత్తుకూ మూలం. విరసంలో ప్రతిభావంతులైన రచయితలు, కళాకారులున్నారు. వీరందరూ ఎవరికివారు విప్లవ సాహిత్యానికి, కళలకు చేసిన దోహదం ఎంతో వున్నది. ఇప్పుడు వీరందరూ ఒక సంఘంగా ఏర్పడ్డారు. వయ్యక్తిక ప్రతిభా కెరటాలు ఒక ప్రవాహంలో సర్దుకునే ప్రారంభకాలంలో తలఎత్తే సమస్యలు— సంఘ పరిధిలోకి, క్రమశిక్షణలోకి వ్యక్తులు తమను తాము మలచుకొనే నిర్ణాయక దశలో ఎదుర్కొంటారు.

ప్రజలు గీటురాయిగా, ప్రజలు ఆదర్శంగా, ప్రజల్నించి నేర్చుకోవడం లక్ష్యంగా ఎంచుకుంటే విప్లవ రచయితల సంఘం సాధించగలదెంతో వున్నది.

— సంపాదకుడు

నవల :

# నా కుటుంబం

టావ్ చెంగ్

(గత సంచిక తరువాయి)

వాడి క్రమశిక్షణాదృష్టికి నేనెంతో ముగ్ధురాలినైనాను. తన ఆనందాన్ని నాకు పంచడానికి ఆరునెల్లు నిరీక్షించడం నాకెంతో ఆనందం కలిగించి.

'ఎప్పుడు తిరిగొచ్చావు?' ఒక కుర్చీలో కూర్చోబెడ్తూ అడిగాను.

"సుమారు రెండువారాలైంది. పనిఒత్తిడివల్ల, తొందరగా వద్దామని ఉన్నా, రాలేకపోయా. కామ్రేడ్ హో మెంగ్ హ్సియంగ్ ఇవ్వాళే వదిలాడు."

"మళ్ళీపోతావా?" అంటూ లి-యూన్ చొక్కాలాగుతూ అడిగాడు చి-హో.

"మరి నీ అభిప్రాయమేమిటి" అన్నాడు లి-యాన్.

"నేన్నిన్ను పోనివ్వను"

"సరే. రోజంతా తూనీగలుపడుతూ గడుపుదాం. ఏమంటావ్?"

"అట్లా అయితే వాంగ్‌పూనదిలో పడటం నీవంతు" అన్నాన్నేను.

"నేను ఈతనేర్చుకున్నాగా" అన్నాడు లి-యాన్. 'ఆఁ అన్నట్లు యింగ్-చీన్ ఎట్లా ఉన్నాడు. అదేగంభీరతఉందా ఇంకా?'

'వాడిమొహం, ఇంకా పంట్లాం తిరగలతొడుక్కుంటున్నాడు; ఎడమకాలిబూటులో కుడికాలు పెడతాడు' అంటూ లోనికొచ్చింది పెన్-వెన్.

కిటికీదగ్గర లి-యాన్‌కు పడక ఏర్పాటుచేశాను కాని వాడక్కడ పడుకోలేదు.

'అమ్మా, నేనూనీదగ్గరే పడుకుంటానే. మాట్లాడుకోవడానికిక్కూడాబాగుంటుంది'

'చిత్రమైనవాడు, విదేశాలకు వెళ్ళివచ్చినా మారలేదు' అని నవ్వుకున్నానునాలో నేనే.

విప్లవకార్యక్రమం చేపట్టినతరువాత లి-యాన్ ఇంటికిరావడం యిదే మొదలు. ఒకే ఊళ్లో ఉంటున్నా నెలలతరబడి ఒకరినొకరు చూసుకోకుండా ఉండడం అలవాటైంది. కాని ఎప్పుడైనా కలుసుకుంటే మాటలకంతుండేదికాదు. ఈ కుటుంబాలకు, తల్లీ కొడుకులకూ ఉండే సంబంధానికతీతమైన ఏదో కానరాని సంబంధం మమ్మల్ని బంధించింది.

"నేను పార్టీలోచేరానమ్మా," అన్నాడు నెమ్మదిగా.

"అయితే కమ్యూనిస్టు ప్రమాణాలతో కొలుచుకోవాలి నిన్ను నువ్వు." అంటూ ప్రోత్సాహంతో పలికాను. "అయినా ఇంకా చిన్న పిల్లవానిగానే స్పష్టంగా కనిపిస్తున్నావ్."

'అంతే, నాకు తిరగటం ఇష్టమైనందుకేగా! నేను మారాలని ప్రయత్నించాను. కాని లాభంలేకపోయింది. జీవితంలో ప్రతి విషయమూ ఉద్రేకజనకమని అనుకోకుండా ఉండలేను.'

నిజంచెప్పాలంటే నాకొడుకులోని ఆశావాదం నాకెంతోనచ్చింది. పోరాటమెంత కఠినమైనదైనా, కష్టాలకు బెదరక ఉత్సాహంగా ఉన్నాడు. విప్లవానికి ఇటువంటి మనస్తత్వమే అవసరం.

సోవియట్ యూనియన్‌నుండి తిరిగివచ్చిన తరువాత తనను కియాంగ్‌సు కమ్యూనిస్టు యువజన సమితి సభ్యునిగాను, షాంఘైజనరల్ ట్రేడ్‌యూనియన్ యువ కార్మికుల శాఖకు నాయకునిగాను నియమించినట్లు చెప్పాడు.

సోవియట్ యూనియన్ పేరు ఉచ్చరిస్తేసరి నాకొడుకు వసపిట్ట అయ్యేవాడు. జవాబుచెప్పడం కొంచెం ఆలస్యమైతేసరి 'అమ్మా! వింటున్నావా?' అంటూ ఆత్రంగా అడిగేవాడు. 'మాస్కో సమావేశం తరువాత మేమందరమూ చదువుకోడానికి ఒక్కచోట చేరాము, తరువాత ఎన్నో ప్రదేశాలు చూశాము. సోవియట్ యూనియన్‌లో శ్రామికులు, రైతులే యజమానులు. ప్రతివారికీ చేయడానికిపని, దున్నటానికి పొలం ఉంటుంది, ప్రతివారూ పాఠశాలకు పోతారు. పరస్పరం దోచుకోవడాలూ, విదేశీ పోలీసుల పొగరుబోతు గస్తీలూ, హింసలూ ఉండవు. అంతమాత్రంచేత కష్టాలులేవని కాదు; భవిష్యత్తులో పరిస్థితి మెరుగుపడడం ఖాయం. చైనాను కూడా సోవియట్ యూనియన్‌లాగానే నిర్మించాలని మనఆశయం, అంతేకదమ్మా?'

"అదయ్యేదెప్పుడు?"

"వస్తుంది, ఆరోజు తప్పకవస్తుంది." కొద్దిక్షణాలు రోజులు లెక్కపెడుతున్నట్లుగా ఆలోచనలోపడి తేరుకున్నాడు. "మహా అయితే ఎనిమిది పదిఏండ్లు పట్టవచ్చు."

"ఆ విప్లవం విజయవంతమయ్యేనాటికి మీ అమ్మ ఎటూ కదలలేని ముసలవ్వ అవుతుంది" కావాలనే అన్నాను.

"అయితేనేం, నిన్ను ముసలివాళ్ల శరణాలయానికి పంపిస్తాం!" వెంటనే అందుకున్నాడు, అప్పుడే విప్లవం విజయం పొందినట్లూ, ఈశాఖ బాధ్యత తనదే అయినట్లూ.

వృద్ధుల శరణాలయం! — ఆ రోజుల్లో కేవలం ఒక కమ్మనికల. శత్రువు వెన్నాడడంతో మా కామ్రేడ్లందరూ ఒక రహస్యస్థావరంనుండి మరోస్థావరానికి మారేవారు. ఒక్కోసారి ఏదైనాగది అద్దెకుతీసుకునే స్తోమతకూడా లేక ఏ రైల్వేస్టేషన్ బెంచీమీదనో రాత్రి గడిపేవారు. ఈ త్యాగాలన్నీ తమకు సౌఖ్యం కావాలనికాదు వారు చేసింది, వారి తరువాతి తరాలవాళ్లకొరకు.

'అమ్మా, ఈ సంగతి తెలుసా? నేను మాస్కోలో ఉండగా వార్తాపత్రికలకు వ్యాసాలు వ్రాసేవాణ్ణి.'

కొద్దిసేపటి తరువాత నాచేయి పట్టుకుని కుదిపాడు "అమ్మా, నిద్రపోయావా?" అంటూ.

"వింటూనే ఉన్నాలే చెప్పు"

"అహఁ... ఇంకేమీలేదు. వింటున్నావాలేదా అని."

"బలేవాడివే!"

పొద్దున్నే పోదామని తయారయ్యాడు. చి-హో వాడి చొక్కాపట్టుకుని వదల్లేదు.

"బుద్ధిగాఉండు. వసంతంలో మళ్లీవస్తాగా. నిన్నుతీసుకెళ్లి పీచ్‌పూలు చూపిస్తాను" అన్నాడు లి-యాన్.

నా ఎదుట కొద్దిసేపు నిలబడి ఏదో కనిపెట్టినవాడిలాగా చూసాడు. 'అమ్మా, నీతల కొంచెం నెరిసిందే.'

"నిజంగానా? అయినా నాకిదివరకటికంటే ఇప్పుడే ఉత్సాహంగా ఉంది."

లి-యాన్ పోదామని తిరిగాడు. కాని ఎందుకో వెనుకాడాడు. 'అమ్మా, కొంచెం జాగ్రత్తగాఉండు. త్వరలోనే నేను మా సోవియట్ ప్రాంతం (ఆ కాలపు విప్లవస్థావరం) లో జరిగే సమావేశానికి వెళ్లవచ్చు. మళ్లివచ్చి నిన్నుచూసే అవకాశం ఉంటుందో లేదో....' అన్నాడు.

## 15

1930లో నగర ప్రాంతాల్లోని పార్టీసంస్థలు తీవ్రనష్టాలకు గురిఅయినా ఎర్ర సైన్యం ఎన్నో ఘనవిజయాలు సాధించింది. జూలైలో మా స్వగ్రామం చాంగ్‌షాలో ప్రవేశించింది. ఇంకోనెల తరువాత నాంచాంగ్‌ను హడలగొట్టింది. వేసవిలో విలాసార్థం లుషాన్‌కు వచ్చిన విదేశీయులు హడలుకొని పారిపోయారు. చలికాలానికల్లా చాంగ్ కై-షేక్ ఒక లక్షమందిని ఏడు డివిజన్లుగా సమీకరించాడు. కేంద్ర విప్లవ స్థావరాన్ని ముట్టడించి దెబ్బతీద్దామని. కాని చిత్తుచిత్తుగా ఓడిపోయాడు. అతడి ప్రధాన సేనానిని ఎర్రసైన్యం పట్టుకుంది. ఈ నరహంతకుని ప్రజల నిర్ణయానుసారం ఉరి తీసినప్పుడు చాంగ్‌కై-షేక్ అతడి అంత్యక్రియలు చాలాపటాటోపంగా జరిపించాడు. అయితే పీనుగుకు బదులుగా వడ్రంగిచేసిన ఒక కొయ్యబొమ్మను పెట్టారు శవ పేటికలో.

"ఆఖరికి నీపాపం పండిందన్నమాట" అనుకున్నాను. ఈరకంగా నాలోని తీవ్రద్వేషం కొంతతృప్తి పొందేది. నా కార్యక్రమాన్ని మరింత ఉత్సాహంగా కొన సాగిస్తున్నాను. గత కొన్ని సంవత్సరాలుగా శత్రువు మా కామ్రేడ్లను చంపడమో జెయిలులో పెట్టటమో కండ్లారా చూస్తూనే ఉన్నాను, నా భర్త, నాపిల్లలచావుకు దుఃఖిం చాను. అయితే యిప్పుడు శత్రువుల్లో ఒకడు మంటగలవడం చూస్తున్నాను.

పార్టీ నాయకత్వంలో కార్మిక, కర్షకుల ఎర్రసైన్యం నానాటికి బలంపుంజు కున్నది. కియాంగ్సి, ఫూకియెన్, అన్‌హ్వేయి, హోనాన్, షెన్సి, కాన్సు క్వాం గ్సిలో, హైనాన్ దీవిలో ఎర్ర స్థావరాలు వెలసినవి. దీనితో కేంద్ర కార్మిక కర్షక ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయవలసిందిగా సోవియట్ల ప్రధమ జాతీయ కాంగ్రెస్‌కు పిలుపునిచ్చింది పార్టీ. ఇదివరలో లి-యాన్ తను వెళ్లవలసి రావచ్చునన్న సమావేశమిదే.

మరి కొద్దిరోజుల్లోనే చాంగ్‌కై-షేక్ రెండు లక్షల సైన్యాన్ని సమీకరించి కేంద్ర విప్లవ స్థావరంపై దెబ్బతీయాలని రెండవసారి సిద్ధమయ్యాడు. సరిగ్గా యిదే సమయాన లి-యాన్, లిన్‌యు-నాన్, హో మెంగ్-సియుంగ్, లిచియు-షీ, లుంగ్‌తా-తావో, హుయె-పింగ్, ఫెంగ్‌చీన్, వుసుంగ్-వెన్‌తో కలిపి మరో ముప్పైమంది షాంఘై అంతర్జాతీయ నివేశన ప్రాంతంలోని హాంకారోడ్డులోనున్న ఫార్ ఈస్టర్న్ హోటల్‌లో సమావేశం జరుపుతున్నారు. సమావేశం ముగియకముందే సైనికులు, పోలీసులు, హోటల్‌ను ముట్టడించి కామ్రేడ్లందరినీ అరెస్టుచేసి లౌజా పోలీసు స్టేష నుకు తీసుకొనిపోయారు.

లియూతెచ్చిన ఈ దుర్వార్త నామీద పిడుగులాంటిది, నోటమాటరాక చాలసేపు అట్లానే నిశ్చేష్టంగా ఉండిపోయాను.

"కోమింటాంగ్ అధికారులవద్దకు పంపబడనంతవరకూ క్షేమంగానే ఉంటారు" అంటూ నన్నూరడించే మాటలు మాట్లాడాడు లియూ

"ఏమైనా లెక్కచేయను" అన్నాను.

ద్వేషం నన్ను తేజితురాల్ని చేసింది. "పోయి లి-యాన్‌కు ఏమో అయిందట పెద్దన్న ఉన్నవైపు వెళ్లవద్దని యింగ్-చీన్‌తో చెప్పు" అని పెన్-వెన్‌తో అన్నాను.

ఆ రాత్రి కంటిమీద కునుకేలేదు.

"అమ్మా ఒంట్లోబాగాలేదా!" అంటూ లేచి అడిగారు పెన్-వెన్, చి-హో లు.

"నేను బాగానే ఉన్నాను, మీరు నిద్రపొండి,"

"అమ్మా ...లి-యాన్‌గురించి చింతిస్తున్నావుకదూ నీవు ...."అన్నాడు చి-హో.

"పిల్లలు పెద్దపెద్ద మాటలు మాట్లాడవద్దు...." తీవ్రంగానే అన్నాను. నాకండ్ల నుండి నీరుజారి మెత్తమీద టపటప పడటం వినిపిస్తూనేఉంది.

రెండవరోజు పొద్దున్నే దొరికిన వార్తా పత్రికలన్నీ కొన్నాను అరెస్టయిన కామ్రేడ్ల సంగతి ఏమైందో తెలుసుకోవచ్చనే ఆశతో, కాని వాళ్ల ఆచూకీ అవంతైనా తెలియలేదు. ఇప్పటి ఈ అరెస్టులు షాంఘైలో పెద్ద సంచలనాన్ని లేపినవి, దానికి కారణం అరెస్టయిన కామ్రేడ్లు కేవలం ప్రజాఉద్యమాల నాయకులు కావడమేకాక వారిలో పెక్కుమంది పేరెన్నికగన్న రచయితలు కావడమే. చాంగ్‌కై-షేక్ ముఠా దీన్నొక ముఖ్యవిషయంగా పరిగణించింది. ప్రజలు వ్యతిరేకిస్తారనే భయంచేత ఈ వార్తలను పైకిపొక్కకుండా అణచిపెట్టారు. నా చేతిలోని వార్తాపత్రికలన్నీ కుంపట్లో పడేసాను.

ఈ కామ్రేడ్ల విషయంలో ద్రోహం జరిగిందని విన్నాను తరువాత. కొద్ది రోజుల్లోనే వీళ్లను షాంఘైలోని కోమింటాంగ్ ప్రభుత్వపు ప్రజారక్షణ సంస్థ (Public Security Bureau) కు మార్చారు. నాంకింగ్, వాళ్లను "అక్కడికక్కడే ఉరితీయుమ"ని ఆజ్ఞాపించినా ప్రజాభిప్రాయభీతిచేత పోలీసులు వెనుకాడారు. 'ఇంకా దర్యాప్తు' చేయాలనే సాకుతో ఆలస్యంచేసారు.

విచారణకాలంలో మా కామ్రేడ్లు పొగతో ఊపిరి సలుపనివ్వక పోవడం, మంటల్లో కాల్చడం మొదలు అతి నవీనమైన కరెంటుషాక్‌ల వరకుగల అన్నిరకాల హింసలు పడ్డారు. అయినా ఏ ఒక్కరూ ఒక్క విషయమూ బయటపెట్టలేదు.

తరువాత వీళ్లందరినీ లుంఘువాలోని వూసుంగ్-షాంఘై సైనిక ప్రధాన కార్యస్థానా (Garrison Headquarters)నికి బదిలీ చేసినట్లు నాంకింగ్ వాళ్లను 'అక్కడికక్కడే ఉరితీయుమ'ని తంతి పంపినట్లు తెలిసింది. దీని తరువాత ఇట్లా అయిందీ అట్లా అయిందీ అని గాలివార్తలేకాని ఇదమిత్థంగా ఏదీతెలియలేదు. గోనెసంచుల్లో బంధించి వాంగ్‌పూనదిలో పడవేసారని కొందరూ, నాంకింగ్‌లో శిరచ్ఛేదము చేసారని మరికొందరూ అన్నారు. అయినప్పటికీ, ఆ కామ్రేడ్ల బంధువులు వారిని జెయిల్లో చూడ్డానికి వెళుతున్నట్లుకూడా వార్తలొచ్చాయి.

నా ఆందోళనకంతులేదు. కాని ఏ సంగతీ తెలుసుకునే దారేలేదు, నా కార్యక్రమము నన్ను బయటపడనివ్వలేదు. రాత్రింబవళ్లు పనిలో నిమగ్నమై ఉండేదాన్ని, కాని ఏంచేసేదాన్నో ఏమాత్రమూ అంతుపట్టేదికాదు. ఆకలిదప్పులు మరచాను, చివరికి పెదవులెండి రక్తాలు కారుతున్నాయనే స్పృహకూడా లేకపోయింది,

"ఇంకాకొంచెం ఆశ మినుకు మినుకుమంటుందమ్మా. పార్టీవారు వారిని రక్షించే ప్రయత్నాల్లో ఉన్నారం"టూ వచ్చి చెప్పాడొకరాత్రి లియూ.

"దానివల్ల ఏంప్రయోజనం?" అంటూ తల అడ్డంగా తిప్పాను. "శత్రువుచేత చిక్కాక ప్రాణాల్తో బయటపడతారంటావా?"

"ఏమో బహుశ...." లియూనన్నింకా ఓదార్చే ప్రయత్నమే చేసాడు.

"ఇది సమరం. 'బహుశ'లకు తావులేదు." ఈ మాటలంటుంటే కంఠంగద్గదమైంది. ఈ తీర్పునంగీకరించలేక పోయింది నా హృదయం.

'అమ్మా, శాంతించు' అని లియూ అన్నాడేకాని తానూ నిగ్రహించుకోలేక పోయాడు.

"పరవాలేదు నేను తట్టుకోగలను." కన్నీళ్ల తుడుచుకున్నాను. "జెయిల్లో వాళ్ల పట్ల ఎట్లా ప్రవర్తిస్తున్నారో తెలుసా? ఏదీ దాచకుండా నీవెరిగిందంతా చెప్పు. నన్నేదీ హడలగొట్టలేదు."

"మంచిగానే ప్రవర్తిస్తున్నారు."

నాకు జరిగిన కథంతా తెలిసింది తరువాత. రహస్య విచారణలో నాకొడుకే ఎక్కువ క్రూరహింసల పాలయ్యాడట అయినా ఏదీ బయటపెట్టలేదు. అతడు చెప్పిందల్లా "నాపేరు యాంగ్‌కువా-హువా. నాతండ్రి స్నేహితుడొకాయన్ను చూడటానికి ఫార్ ఈస్టర్న్ హోటల్‌కు వచ్చాను. దీన్నిమించి నేను చెప్పేదేమీలేదు" అని మాత్రమే. లి-యాన్‌ను గుర్తించటానికి ఒకద్రోహిని రప్పించాడు శత్రువు.

ఆ ద్రోహి బహుబలహీనమైన స్వరంతో "ఇతనిపేరు ఉయాంగ్ లి-యాన్. షాంఘై కార్మిక సంఘానికి యువకార్మిక శాఖకు నాయకుడు. కియాంగ్సు కమ్యూనిష్టు యూత్‌లీగ్ కమిటీ సభ్యుడు. ఇతడి కుటుంబమంతా కమ్యూనిస్టులే," అన్నాడట.

"సిగ్గుదప్పిన ద్రోహి!" అని నా కొడుకు వాణ్ణి నిప్పులు కురిపిస్తు ఉరిమాడట.

"అయితే నీవు లి-యాన్‌వనీ, కమ్యూనిస్టువనీ ఒప్పుకుంటున్నావన్నమాట," అన్నాడు జడ్జి లేని ఉత్సాహాన్ని నటిస్తూ. "ఆఁ....ఇంకేమున్నాయి విశేషాలు?"

"వినాలని ఉబలాటంగా ఉందా?" అన్నాడు నాకొడుకు హేళనగా. "చెప్తాను! ఈ చైనా విప్లవం జయించడం, కోమింటాంగ్ నశించడం తథ్యం! ఆఁ...అవును. నేను కమ్యూనిస్టునే. నన్నుకాల్చిన బూడిదకూడా నూటికి నూరుపాళ్లు కమ్యూనిస్టుగానే ఉంటుంది, ఆ ఆదర్శంకొరకు, ప్రజలకొరకు, నిర్విచారంగా ప్రాణాలర్పిస్తాను."

"ఇంకా లేతవాడివి. ఈ లేతవయసులోనే చావవలసిరావటం చాల విచారకరం" ఎంతో జాలినటిస్తూ పలికాడు జడ్జి. "నిన్ను విడుదలచేయించటానికి ప్రయత్నించ గలన్నేను. ఒకవేళ నీవు...."

"అనవసరంగా సమయం పాడుచేసుకోకండి. నానుండి మీరు రాబట్టగలది శూన్యమే!" నాకొడుకు ఘాటుగా అన్నాడు శత్రువుతో.

అరెస్టయిన వారందర్లోకి నాకొడుకే చిన్నవాడు. అనుభవంలేని అర్భకుడుకదా ఏమైనా రహస్యాలు రాబట్టవచ్చుననుకున్నారు. కాని ఘోరంగా చిత్తైపోయారు.

జెయిల్లోని ఒక చల్లనికొట్లో పడేశారు. మా సహాయక సమితివాళ్లు కాపలా వాళ్లకు లంచమిచ్చి దుస్తులు, కొంతడబ్బు పంపించారు. ఆ రాత్రి కామ్రేడ్లంతా ఆ డబ్బెట్లా ఖర్చుపెట్టాలా అని చర్చించుకున్నారు. కొందరు నిత్యావసరాలకు ఖర్చు పెట్టాలనీ, మరికొందరు అత్యవసర పరిస్థితుల్లో ఖర్చుపెట్టుకోవడానికి దాచిపెట్టాలనీ అన్నారు. అయితే లి-యాన్ ఎవరి అభిప్రాయాన్నీ అంగీకరించలేదు.

"ఇక్కడున్న మనమంతా చావడం తథ్యం. అది ఇవాళే అయినా కావచ్చు. చలిగాఉంటేమాత్రం మనకేం. నేననేదేమిటంటే మనదుస్తులు, టూత్‌బ్రష్‌లు ఇక్కడ శిక్షననుభవిస్తున్న కామ్రేడ్లకిద్దాం; ఇక డబ్బంటారా, ఏవో తినుబండారాలూ పానీయాలూ కొనుక్కొని విందుచేసుకుందాం. దాంతో మనం చావటానికిముందు అంతర్జాతీయ గీతం పాడటానికి, నినాదాలివ్వడానికీ కొంతబలమైనా వస్తుంది."

వాడు నాకొడుకు. ఎట్టి పరిస్థితుల్లోనూ, ఎక్కడఉన్నా పోరాటాన్నాపడు. వాడి మాటలకందరూ సంతోషించారు.

"నీ సూచనబాగుంది. బాగాతిందాం; చివరివరకూ తీవ్రంగా పోరాడుదాం!"

"ఒక మంగలిని తీసుకురండి, క్షౌరం చేయించుకుందాం. మనల్ని కాల్చివేసిన తరువాత శత్రువు ఫోటో తీసుకుంటే బాగా కన్పిస్తాం!" ఎప్పుడూ నోరుమెదపని హూయె-పింగ్ అన్నాడు.

వీళ్ల అట్టహాసాలు విని కాపలావాళ్లు ఉరికొచ్చారు. వాళ్లెంత మొత్తుకున్నా ఒక్క ఖైదీ చెవినిపెట్టలేదు. దాంతో కాపలావాళ్లు అందరికీ సంకెళ్లు తగిలించారు.

ఫిబ్రవరి 8 అర్ధరాత్రి బాగా మసురుపట్టింది. కొద్దిసేపట్లో పొడిపొడిగా మంచుకురువడం మొదలైంది. కామ్రేడ్ హో, మెంగ్-సియుంగ్ నిద్రపోలేదు. గదిలోఉన్న ఒకేఒక చిన్నకిటికీకి ఆనుకొని దట్టంగా మబ్బులు గమ్ముకున్న ఆకాశం వైపుచూస్తూ "మళ్లీ మంచుకురుస్తోందే" అంటూ గుణుక్కున్నాడు.

సంకెళ్ల గలగల్లాడిస్తూ నాకొడుకతణ్ణి సమీపించాడు. "ఏం.... మంచు సౌందర్యాన్నాస్వాదిస్తున్నావా?"

"ఉహ్హుఁ..." యోచనామగ్నుడై ప్రత్యుత్తరమిచ్చాడు మెంగ్-సియుంగ్. "మంచు భయంకరంగా కురుస్తుంది, గోధుమమొక్కలు చస్తాయి."

"నేనేమాలోచిస్తున్నానో తెలుసా?" హో మెంగ్-సియుంగ్‌కు అనుకోని మాట్లాడుతున్నాడు లి-యాన్ "వసంతంలో పీచ్‌పూలు చూపెట్టడానికి తీసుకొని పోతానన్నాను చి-హోను, కాని.... కాని ఇక నామాట నిలబెట్టుకోలేను."

ఆ క్షణంలో వాడు విచారపడ్డది బహుశ ఒక్క ఈ విషయంలోనే కావచ్చు.

వాళ్లను రక్షించాలని పార్టీచేసిన ప్రయత్నాలు ఫలించలేదు. నాంకింగ్ 'అక్కడికక్కడే ఉరితీయండం'టూ మరో టెలిగ్రాం పంపింది. మంచుకురుస్తున్న ఆరాత్రి వూసుంగ్-షాంఘై సైనిక ప్రధాన కార్యస్థానపు (Woosung Shanghai Garrison Headquarters) బరువైన ఇనుపగేట్లు అకస్మాత్తుగా తెరువబడ్డాయి. సాయుధ సైనికులు లాంతర్లు చేతపట్టుకొని నేలకానుతున్న కప్పుఉన్న ఆ జెయిలుగదిలోకి ప్రవేశించారు.

ఆ కోలాహలానికి ఖైదీలంతా మేల్కొని కటకటాల సందుల్లోనుండి బయటికి చూచారు. ముందున్న సైనికుడు బొంగురుగొంతుతో ఒక పట్టికలోని పేర్లు చదివాడు. "లిన్‌యు-నాన్, హో మెంగ్-సియుంగ్, లుంగ్‌తా-తావో, ఉయాంగ్ లి-యాన్, హుయె-పింగ్...."

ఇరవైమూడు పేర్లు. "మమ్మల్నెక్కడికి తీసుకెళ్తున్నారు?" చీకట్లో ఎవరిదో ప్రశ్న.

"చక్కగా నాంకింగ్‌కు."

నాకొడుకుతు వాడి కాళ్ళమీద్లకు వేసిన సంకెళ్ళను ఒకేగొలుసుకుకట్టి పశ్చిమోత్తర దిశగా తీసుకుపోయారు. సన్నని పల్చని మంచు గాలిలో నిండింది. ఒట్టి కాళ్ళతో మంచుకప్పిన నేలమీదనడచి, ఒక చిన్న వంతెన దాటి గడ్డకట్టిన కాలువగట్టు చేరారు. కనుచూపుమేరలో ఇంటిచాయలేదు. పోలీసులు వాళ్ళనాపారు. తమకు కాలమాసన్నమైనట్లు తెలుసుకున్నారు ఖైదీలు. సంకెళ్ళతో కాపలావాళ్లను కొడదామని అంతా ఒకేసారి చేతులెత్తారు. అభిమానపూరితమైనవారి 'అంతర్జాతీయ' గీతాలాపనలూ 'కమ్యూనిస్టుపార్టీ వర్ధిల్లాలి!' నినాదాలూ తుపాకి కాల్పుల్లో కరిగిపోయాయి.

మొత్తం 87 తూటాలు పేల్చారు. ఒక్కొక్కళ్లకెన్నో గుండ్లు తగిలాయి. తన నేరాన్ని కప్పిపుచ్చుకోడానికి అమరవీరులనందర్నీ తవ్వి సిద్ధంగాఉన్న గోతుల్లో లోతుగా

పూడ్చిపెట్టాడు శత్రువు. వాళ్ల తొందరలో ఖైదీలచేతి సంకెళ్ళన్నా తొలగించాలనే యోచనకూడా లేకపోయింది.

చాల రోజులు నా గుండెకోతను పైకగుపడకుండా మొండిగా మసలుకున్నాను. దీనికి మౌనం వహించడమే ఏకైకమార్గం. పిల్లలకు తమ అన్న సాహసోపేతమైన ప్రాణత్యాగాన్నిగురించి తెలుపలేదు. వారి లేతగుండెలప్పటికే ఎంతో గాయపడ్డాయి. ఎంత కఠినాత్ములైనా తన కడుపుకోతను తన పిల్లలకు తెలియనీయదు; కాని అది ఎంతకాలం దాగుతుంది. తల్లిబాధను ఆమె ప్రతి కదలికలోనూ పసికట్టగలరు పిల్లలు. లి-యాన్ పేరెత్తడం మాని యిల్లుకడగడం నేను చేస్తానంటే నేను చేస్తానంటూ అక్కతమ్ముళ్లు పోట్లాడుకున్నారు. పొద్దున్నే లేవగానే కిటికీలు, నేల, తళతళలాదేవరకూ కడిగారు. రాత్రింతా ఏడ్వడంవల్ల పొంగినవాళ్లకండ్లు నా గుండెను పిండినవి.

నేనెన్నోబాధలు అనుభవించాను. కాని ఇలాంటి గుండెలు పిండేబాధ ఎప్పుడూ ఎరుగను. కామేడ్లెంతో ప్రయత్నించారు నన్నోదార్చడానికి. కాని తల్లివేదనను శాంత పరచే మాటలెక్కడున్నాయి!

ఎంతటి క్రూరకాలమది! క్రూరమైన కోమింటాంగ్ యెంతో మందిని అంతం చేసింది. కాని బంధువులకు కనీసం వాళ్లనెక్కడ పూడ్చిపెట్టినవిషయమైనా తెలియనివ్వలేదు. విధవలు, అనాధలు ఎవలేని దుఃఖాలపాలయ్యారు. ఒంటరిజీవితాన్నీడ్చారు. దేశంవిముక్తి పొందిన తరువాతనే షాంఘై ప్రజాపరిషత్తు (Shanghai People's Council) ఒక గోరీలు తవ్వేవానిద్వారా తెలుసుకుంది అమరవీరుల నెక్కడ పూడ్చిందీ. వారి సాహసాలనూ త్యాగాలనూ స్మరించుకోవడానికి ఒక స్మారక స్తూపాన్ని కట్టారు వారి అస్తులపైన. ఆ స్తూపంపైన ఇరవైముగ్గురు అమరవీరులపేర్లు చెక్కారు. ఒక గంభీరమైన స్మారకసభ జరిపారు. నాకొడుకు వాడి సమరోత్సాహపూర్ణులైన మిత్రుల సంస్మరణార్థం నేనొకపద్యం రాశాను:

అమరవీరులు గతించి ఇరవై సంవత్సరాలు
కాని వారు చిరస్థాయిగా నిలుస్తారు.
ఆ ఇరవైముగ్గురు వీరుల పేర్లు
వారి విశ్వాసపూర్ణ ఆత్మలు, సత్యమనస్సులు ఈ జగత్తును వెలిగిస్తాయి.
నా వీరపుత్రుడు వారందర్లోకీ చిన్న
పోరాటంలో బాల్యంనుండే మిన్న
తండ్రిలాంటి వివేకం, ఆశయం సమున్నతం,
తనవర్గ శ్రేయస్సే వ్రతం నిరంతరం

పట్టపగలు బయటికిరాను ముఖం చెల్లక,
దొంగలు, ఖైదీలను అర్ధరాత్రి బయటికి పంపారు
పాడే గొంతులు, పేలిలే రైఫిల్ లంగువాను కుదిపింది,
ఆ ఉడుకు నెత్తురు స్వాతంత్ర్య సుమాన్ని పోషించింది.
నెత్తుటి మరకలు మంచును ముత్యాల్లా చేశాయి[1]
వారి అస్తులు అస్త్రాలు-వజ్రాలు, బల్లాలు
వారి సమాధి దర్శించడానికిపోతే
ఎంతో గుండెకోత, కాని అదెంత గర్వకారణం!

# 16

సంఘజీవితం యథాపూర్వం సాగిపోతూంది. కాని నవంబర్‌లో తరచు మమ్మ లనుకలిసే కామ్రేడొకడు అరెస్టుకావడంతో వెంటనే స్థావరం మార్చవలసిందిగా ఆదే శించింది పార్టీ. పత్రాలన్నీ సవ్యంగా విభజించి, సామానన్నీ సర్దుకొని, ఇద్దరుపిల్ల లను వెంటబెట్టుకొని ఫోక్ అవెన్యూలోని ఒకహోటల్‌కు మారాను. మా కార్యక్రమం మళ్ళీ కొనసాగించడానికి మరోస్థలం అద్దెకు తీసుకున్నాము. నేను పూర్తిగా స్థిరపడక ముందే అంతర్జాతీయ వ్యవహారాల కేంద్రకమిటీ శాఖ (Central Committee Dept for International affairs) కార్యాలయానికి రావలసిందిగా సంస్థ తెలియజేసింది. ఇక్కడే మళ్ళీ యింగ్-చీన్ మాతో కలిశాడు.

మా సంస్థ కొత్తకార్యాలయము చాంగ్‌తోటఅనే మూడంతస్తుల మేడలో ఉంది. శ్రేష్ఠమైన మహాగని ఫర్నీచర్‌తో చాల విలాసంగా వుంది. మా సాంఘిక స్థాయిలో ఆశ్చర్యకరమైన మార్పులు వచ్చాయి నేనిప్పుడొక వ్యాపార ప్రెస్ భాగస్వామిభార్య శ్రీమతి లిన్‌ను, పెన్-వెన్ "చిన్నదొరసాని", చిహో "చిన్నదొరగారు", యింగ్-చీన్ "చిన్నదొరగారి"ని రోజూ బడికి తీసుకొనిపోవలసిన "సేవకుడు". కామ్రేడ్ షెన్ కామ్రేడ్ వాంగ్‌లిద్దరూ పైఅంతస్తులోవుండి కార్యక్రమాలు చూసేవారు. పెన్-వెన్ రెండవ అంతస్తులో వుండేది. నేనూ యింగ్-చీన్ మాత్రం గృహకార్యక్రమాలు చూడడం తేలికని కిందిభాగంలో ఉన్నాం.

వివిధ కామ్రేడ్‌లను కలుసుకొనే కార్యక్రమం పెన్-వెన్‌కు అప్పగించబడింది. శిరోజాలంకరణ, పెదవులకు రంగు, అందమైనదుస్తుల్లో బిడ్డ ఒక లక్షాధికారికూతురని పించేది. వివిధమైన పత్రాలూ సమాచారాలూ అందజేస్తూ దినమంతా బయటనేఉండేది.

1. అమరజీవాంతం ఒక ఆదర్శానికి కట్టుబడి ఉండడానికి సంకేతం.

'అంతా సవ్యంగానేఉంది. అపాయమేదీలేదు'అని తెలియజేయటానికి పైఅంతస్తు కిటికీ ఒకదానిపై సంకేతాన్నుంచేదాన్ని. ఏ కామ్రేడ్ వచ్చినా మొదట ఆ సంకేతం చూసుకోవాలి.

మేమక్కడొక నెలైనా గడపకముందే ప్రమాదం వాటిల్లింది. కేంద్ర కమిటీ కార్యదర్శి కార్యాలయంనుండి కొన్ని ముఖ్యపత్రాలు తేవడానికి కామ్రేడ్ షెన్, యు అనే పేరుతో ఒక వార్తాహరుణ్ణి పంపాడు. యు మధ్యాహ్నానికి పూర్వమే రావాలని స్పష్టంగా చెప్పాడుకూడా. అయినా సమయం దాటింది. రహస్యజీవిత క్రమశిక్షణను సరించి ఏదైనాసరే అనుకున్న సమయానికి ఒక నిమిషం అటూ యిటూ కాగూడదు, అయిందా వెంటనే స్థావరం మార్చాలి.

అది దీపాలపండుగ. అందరిమాదిరిగానే మేముకూడా ముఖద్వారానికి దీపాలు వేలాడగట్టాం. కామ్రేడ్లకు ఏదైనా మంచి వంటకాలు పెట్టాలనే ఉద్దేశంతో ఒక కోడి పెట్టను తెద్దామని మార్కెట్ కుకూడా వెళ్లివచ్చాం. యు భోజనసమయానికికూడారాలేదు. అందుకే మొదట భోజనాలుకానిచ్చాం. అతనికొరకు ఒక కాలు ప్రత్యేకించి పెట్టాను. అన్నం వేడిగాఉండాలని పొయ్యిమీదేఉంచాను. ఒంటిగంటకుకూడా అతడిపొడ కన్పిం చకపోయేసరికి ప్రతివాళ్ళకూ ముళ్ళమీదకూర్చున్నట్లయింది.

"హుం.... చాల ఆలస్యంచేశాడు"అన్నాడు షెన్.

"ఏమైనా సంభవిస్తుందేమో, అన్నీ సర్దుకొని సిద్ధంకండి"అన్నాన్నేను.

ఎప్పుడేం జరుగుతుందో చెప్పేవీలుండేదికాదారోజుల్లో. దారేపోతున్నకామ్రేడ్ తననెవరో వెంటాడుతున్నట్లు గమనించడమూ శత్రువును వదిలించుకోవడానికి మెలికె దార్లవలంబించడమూ జరుగుతూ వుండేది. ఎక్కడో దారిలో ప్రమాదం సంభవించి మార్గం మూతబడడమూ, కామ్రేడ్లు చుట్టూతిరిగి స్థావరానికి ఆలస్యంగాచేరడమూ జరిగేది. మరోవైపున మాలో కొందరు శత్రువులచేతజిక్కితే హింసించి చంపుతారేమోననీ భయపడేవారు. అలాంటి వాళ్ళకు ఒకటి రెండు కొరడాదెబ్బలే చాలు పూర్తిగా పతనం చెందటానికి. ఉదయం మాలో మసలినమనిషే మధ్యాహ్నం శత్రువుకు మార్గంచూపే వాడు మమ్మల్నరెస్టుచేయడానికి. యు ఎలాంటివాడనేప్రశ్న ఉదయించింది నా మెదడులో.

దొడ్డిద్వారంవద్ద గంటమోగింది. ఇది పూర్వమే నిర్ణయించుకున్న సంకేతం.

'అమ్మా, యూమామ, నువ్వు భోజనం సిద్ధంచెయ్యి, నేను తలుపుతెరుస్తాను' ద్వారంవైపు ఉరుకుతూ అన్నాడు చి-హో.

"అరేయ్, ఒకనిమిషమాగు"అన్నాను.

నా అనుమానాలన్నీ నిరాధారాలేనేమో అనుకుంటూ వాడివెనకే పరిగెత్తాను. అప్పటికే చి-హో తలుపుతెరవడమూ ఐదుగురు రాక్షసుల్లాంటి మనుషులు తోసుకొని రావడమూ జరిగాయి. వారి నల్లదుస్తులుచూసి రహస్య పోలీసుశాఖవారని వెంటనే పసిగట్టాను. ముందుకురికి వారిదారినడ్డగించి,

"ఏంకావాలిమీకు" అన్నాను.

నాకు దగ్గరగా ఉన్నవాడు రివాల్వరుతీసి నావైపు గురిపెట్టి 'కదలకు' అన్నాడు.

షెన్, పెన్-వెన్‌లిద్దరూ రహస్యపత్రాలను జాగ్రత్తగా విభజించి కాలుస్తూంటారని నాకు తెలుసు. పై అంతస్తుల్లో ఉన్నవాళ్ళను హెచ్చరిద్దామనే ఉద్దేశంతో వెనక్కడుగువేసి గొంతెత్తి

"దొంగలు, దొంగలు!" అని అరచాను.

"నోర్ముయ్!...." అన్నదోగొంతు. పరిచితమైనగొంతేననిపించి ముఖం పరికించాను- వీడిదివరకు చూపినవాడే, ద్రోహి. ఆ యూ. ఆ తుచ్ఛపుపంది, మమ్మల్ని పట్టించాడని స్పష్టమైంది.

తుపాకికొనతో నెట్టుకుంటూ వంటగదిలోవేసి బంధించారు.

"దొంగలు! దొంగలు!" అంటూ పీలైనంత పెద్దగా, తలుపుమీద బాదుతూ అరిచాను.

వాళ్లు టకటకమంటూ మేడమెట్లెక్కుతున్నచప్పుడు వినిపించింది. యింగ్‌చీన్, నేనూకలసి తాళం బద్దలుచేశాం కాని బక్క కుక్కమాదిరిగా ఉన్న రహస్యపోలీసొకడు పిస్తోలు చేతబట్టుకొని,

"ఊఁ....లోపలికి!" అంటూ ఘుర్ఘురించాడు.

పైనుండి తలుపులు బాదుతున్నచప్పుడు, ఏదో ఇనుప పరికరంతో తాళం పగులగొట్టే చప్పుడు వినవచ్చాయి- ఫెళఫెళమంటూ తలుపు విరిగింది, దడదడమంటూ బల్లలు, కుర్చీలు విసురుతున్న చప్పుడు. చివరికి దెబ్బతిన్నపంది అరుపొకటి....

"రక్షించండి, రక్షించండి! కమ్యూనిస్టుగాళ్లు మమ్మల్ని చావగొడ్తున్నారు!"

మాదగ్గర కాపలాఉన్న పోలీసువాడు అటుఉరికాడు. చిహో నాచెయ్యిపట్టుకొని లాగి 'అమ్మా, పదపద, పారిపోదాం' అన్నాడు. దానితో నేసీలోకంలోపడ్డాను. పారిపోవటానికిదే తగిన అదనని నిర్ణయించుకున్నాను.

'యింగ్-చీన్, నీవు ముందుద్వారంగుండా పారిపో. కనీసం ఒక్కరమైనా తప్పించుకుంటాం' అన్నాను.

'ఉహుం.... వీల్లేదమ్మా. చావుతప్పదంటే, కలిసేచద్దాం' అని వాదనకు దిగాడు.

నాకు మంటబుట్టింది. వాదనకిదా సమయం!

'పారిపోరా మూర్ఖుడా! లేకపోతే ఎవరమూ తప్పించుకోలేము' అని కోపంగా అన్నాను

ఇంకా సంకోచిస్తున్నట్లుగానే కన్పించినా చివరికి ఒప్పుకున్నాడు. 'సరే, అయితే ప్రింటింగ్ ప్రెస్‌కుపోతాను.'

ఇదివరకు ప్రింటింగ్ ప్రెస్‌ను వదలి వచ్చేటప్పుడు హునాన్‌కు బంధువులను చూట్టానికి వెళ్తున్నట్లుచెప్పి వచ్చాడు యజమానితో. కనుక వీడు తిరిగి పనిలోచేరటం అనుమానానికవకాశమేమీ యివ్వదు.

పై అంతస్తులో అడుగులచప్పుడు పెద్దగా వినవస్తున్నది. 'నువ్వు పాడుగాను! ఎటుపోతున్నావ్?' అని ఎవరో అరవడమూ, 'ఏయ్‌య్.... వాడు కిటికీలోనుండిదూకాడు! పట్టుకోండి తొందరగా' అని మరోకంఠము తోడుపలకడమూ ఒకేసారిజరిగాయి.

దూకిందెవరు? ఉరికి కిటికీలోనుండి బయటికిచూశా, భయంతో చెమటలు కక్కుతున్నా. ఇద్దరు రహస్యపోలీసులు వాంగ్‌ను తీసుకొనిపోతున్నారు. అయితే దూకింది షెన్ అయ్యుండాలి.

కోలాహలం మాటుమణిగి ప్రశాంతంగా ఉంది. హఠాత్తుగా షెన్-షెన్ గుర్తుకొచ్చింది.

'షెన్-షెన్! షెన్-షెన్!' అంటూ కేకలువేస్తూ పైఅంతస్తుకు వెళ్లాను. అక్కడెవరూలేరు. అక్కడ బల్లలు, కుర్చీలు, పడకలు, పగిలిన అద్దాలు అన్నీ చిందరవందరగాపడున్నాయి. కిటికీలో సంకేతంలేదు. బిడ్డదూకి తప్పించుకొని ఉండవచ్చునా?

ఏదిఏమైనా ఇంకా అక్కడ ఉండడం అవివేకం. శత్రువేషణాన్నయినారావచ్చు. చి-హోను పట్టుకొని వెంటనే బయటపడ్డాను. ఇప్పుడెక్కడికిపోగలం? చేతిలోకొంత చిల్లరతప్ప డబ్బుకూడాలేదు. ఎవరింటికైనా వెళ్దామంటే వాళ్ళనూ ఇందులో ఇరికించినదాన్నవుతానేమోనని భయం.

చి-హో చేయిపట్టుకొని బజారునపడిపోతుంటే ఎవరిదో పిలుపు వినిపించింది.

"శ్రీమతి లిన్! శ్రీమతి లిన్!"

ఎవరైయుంటారు అని ఆలోచనలోపడ్డాను. కాని లక్ష్యపెట్టకుండా నడక సాగించాను.

"చి-హో! చి-హో!"

ఇక తిరిగిచూడక తప్పలేదు. తీరాచూస్తే ఇదివరలో మా పొరుగుననున్న ప్రొఫె సర్ చాంగ్ ఫెంగ్-చెన్. మేము సెక్రెటేరియట్‌కు వచ్చేటప్పుడు ఆమెకు కేకులు కానుకగా యిచ్చాం. ఆమెకభివాదంచేశాను, మాదగ్గరికి వచ్చిందామె.

"ఏమండీ ఇల్లు ఎప్పుడుమార్చారు? అసలు నేను కూడ మార్చాను కనుక నాకు తెలియనే తెలియదు, చాలరోజులాయెచూసి. ఎటువెళ్తున్నారివాళ?"

"ఆఁ ఎటుంది, ఏమైనా కొందామని బజారువైపొచ్చా"నని సమాధానమిచ్చాను.

అడ్రసిచ్చి ఎప్పుడైనా రమ్మన్నది కబుర్లుచెప్పుకోవడానికి. కృతజ్ఞతలతో వీడ్కో లిచ్చాము. ఇలాంటి పరిస్థితుల్లో ఆహ్వానాలు!

కొద్దిసేపు అటుయిటు తిరిగినతరువాత యింగ్-చీన్‌దగ్గరికి వెళ్దామనుకున్నాను.

వాడు ప్రింటింగ్ ప్రెస్ చేరగానే దారిలో ఎవరో మీదపడి దోచుకున్నారని కథ చెప్పాడు యజమానికి. అతడిదంతానమ్మి ఒకనెలజీతం అడ్వాన్సుగా యిచ్చాడు దానికి కారణముంది. యింగ్-చీన్ తక్కువజీతానికే చాల నమ్మకంగా ఒళ్లువంచి పనిచేసేవాడు. అలాంటివాణ్ణి వదలుకోదలచలేదు.

కష్టపడి ఎలాగో ఒక దర్జీ దుకాణంపైనున్న అటక రెండు డాలర్లకద్దెకు తీసుకు న్నాను. అందులో ఒత్తిగిలిపడుకోటానికిమాత్రమే సరిపోయే ఒక పడకఉంది. చి-హో నేను పక్కకుతిరిగి పడుకునేవాళ్లం. వేరేసామాన్లేవీ పెట్టుకోవడానికి స్థలం లేదు. కిరస నాయిలు స్టౌ కిందనే పెట్టుకున్నాం. వంట వండుకోవాలన్నా, నీళ్లు కాచుకోవాలన్నా కిందికీ మీదికీ ఉరకలుపెట్టవలసిందే. ఇక్కడ ప్రశాంతంగా స్థిరపడి పార్టీతో సంబం ధాలుపెట్టుకోవచ్చుననుకున్నాను.

పెన్-పెన్ అరెస్టయింది. పదిరోజులకుపైగా బిడ్డ సజీవంగా ఉన్నదీ లేనిదీ తెలి యలేదు. ప్రొఫెసర్ చాంగ్ ఫెంగ్-చెన్ భర్త ప్రగతిశీలదృష్టిగల న్యాయవాది అని గుర్తొచ్చింది. అతడికి కమ్యూనిస్టుపార్టీపట్ల సానుభూతిఉంది. అందుకే బెయిలుమీద అమ్మాయిని విడిపిస్తాడనే ఆశతో వారున్నయిల్లు వెదికి పట్టుకున్నాను. అనుకున్నదాని కంటే ఎంతో సులువైపోయిందిపని. పెన్-పెన్‌కింకా పదహారేళ్లు నిండలేదుకనుక ఒక సారాదుకాణదారుని పూచీపై విడుదలచేశారు.

ఇంటికి వచ్చినతరువాత అన్నివిషయాలూ చెప్పింది. దాడిజరిగిననాడు తనను స్పృహతప్పేట్టు కొట్టి ఒకమూలకు విసిరేశారట. నా హడావిడిలో బిడ్డ యెక్కడున్నదీ గమనించలేదు, పోలీసులు తరువాతవచ్చి అరెస్టుచేసి తీసికెళ్లారట. పెన్ ఒక్కదే

ముగ్గురు పోలీసులను నిలువరించారట కుర్చీతో. "మనలోనే ఉంటుంది, ఇది తీసుకొని సిగరెట్లు కొనుక్కోండి" అంటూ వాంగ్ ఒక నోట్లకట్ట యివ్వబోయాడట లంచంగా. 'అలాంటిప్రయత్నాలు చేయకు' నిస్పృహతో నోట్లు నేలకేసికొడ్తూ అన్నాడట. వాడి దృష్టి అంతా షెన్, వాంగ్‌లను పట్టుకోవడంమీదేఉంది. అటు పోట్లాటజరుగుతూండగానే షెన్-షెన్ కిటికీనుండి సంకేతం తీసివేద్దామని చూసింది. ఇదిచూసి వాళ్ల నేలకుబాది నిస్పృహతప్పేట్లుచేశారు. వాంగ్ గాయపడ్డాడు. కిటికీనుండి దూకుతుండగా షెన్‌కాలు విరిగింది. దాంతో యిద్దరూ అరెస్టయారు. 'చెల్లీ, మేము చావుకుసిద్ధంగానే ఉన్నాం' అన్నారు షెన్-షెన్ వాటితో పోలీస్‌స్టేషన్‌లో ఉన్నప్పుడు.

కొద్దిరోజులపిదప కమ్యూనిస్టుపార్టీతో తమ సంబంధాన్ని పూర్తిగా తెగతెంపులు చేసుకుంటున్నట్లొక పత్రికాప్రకటనచేశారు. శత్రువు మెప్పు పొందడానికి తమ తుచ్ఛ మైన దీనపుబ్రతుకు వెళ్ళబోసుకోటానికి తామిదివరకు నమ్మినామంటూ గర్వంగాచెప్పు కున్న ఆదర్శాలపైనే దుమ్మెత్తిపోసి అవమానించారు. నిందలువేశారు.

## 17

ఆరోజుల్లో ఎవరైనా రహస్యకార్యకర్తకి పార్టీతో సంబంధం తప్పిందంటే మళ్ళీ స్థాపించుకోవటం బహుకష్టంగా ఉండేది. ఎల్లెడలా వ్యాపించిన ద్రోహులవలల్లో చిక్క కుండా జాగ్రత్తపడవలసి వచ్చేది. ఒకవేళ తమ మనిషే ఎవరైనా తటస్థపడ్డా తనకు అతనిపై పూర్తిగా నమ్మకం కుదిరేవరకూ దూరంగా ఉండవలసిందే

తరచూ యింగ్-చీన్‌ను కలవడానికివచ్చే ఒక కామ్రేడ్‌తో ఈవిషయమై ప్రస్తా విస్తే ఒక ఉత్తరం వ్రాస్తానన్నాడు. కాని నెలలుగడిచినా సమాధానంరాలేదు. పార్టీతో సంబంధం నెలకొల్పుకోగల ఆశలు నానాటికి సన్నగిల్లాయి. దానికై నామూర్ఖతకునన్ను నిందించుకోవడంతప్ప ఏమీ చేయలేకపోయాను. అనుకోకుండా ఒకనాడు నల్ల ఓవర్ కోటు వేసుకున్నవ్యక్తి ఒకడు మా అటకమీదికి వచ్చాడు.

''యాంగ్‌పేరుగలవారెవరైనా ఉన్నారాయిక్కడ?'' అంటూ ఏదో యిబ్బందిగా ముఖంపెట్టి అడిగాడు.

'మీరెవరు?' అంటూ దేనికోసం వెదుకుతున్నాడో తెలుసుకోవాలనే ఉద్దేశంతో ఆపాదమస్తకం పరిశీలిస్తూ అడిగాను.

'ఓహో అయితే నేను సరియైనస్థలానికి రావడంలో పొరపడ్డానన్నమాట, కిం దికేవెళ్ళి అడిగి తెలుసుకుంటానంటూ తొందరగా వెళ్ళిపోయాడు. నేనతనివెనకే పరి గెత్తాను. కాని నేను ద్వారంచేరేవరకే సందులో ఎక్కడో మాయమయ్యాడు.

"అయ్యో మూర్ఖురాలా! అట్లా ఎందుకు వ్యవహరించావతనితో? సంస్థపంపితే వచ్చాదేమో. లేకపోతే...."అనుకుంటూ ఆలోచనలోపడ్డాను.

బట్టలుతకడం, కుట్టడంలాంటి చిన్నచిన్నపనులు చేస్తున్నాను పార్టీకొరకు అన్వేషణసాగిస్తూనే. నమ్మదగినవాళ్ళనిపించినవాళ్ళనుండి ఏమైనా ఆధారాలుదొరుకుతాయేమోనని ప్రయత్నిస్తూనేఉన్నాను. అయినా ఫలించలేదు. పార్టీప్రోత్సాహం, మార్గదర్శకత్వంలో భర్త, కొడుకు లేనిలోటు కొన్ని సంవత్సరాల వరకు సహించగలిగాను. ఒంటరిననుకోలేదు. కాని ఇప్పుడు దారంతెగిన గాలిపటాన్నయిపోయాను. మా జీవిత పరిస్థితి నానాటికి దిగజారింది. యింగ్-చీన్ తెచ్చినదాంతోనే పొట్టపోసుకున్నాం. అంటే పస్తులున్నాం. ఒక అటికెడుజావ కొనుక్కొని అందరమూ తాగేవాళ్ళం. నెల చివరిరోజుల్లో కనీసం అదికూడా కొనుక్కోలేకపోయేవాళ్ళం. ఒకసారి ఒక దర్జీదగ్గర మూడునాళ్లు రాత్రిలకుసరిపడే పని దొరికింది. ఒక వెండిడాలర్ చేతికొచ్చింది.

"హుర్రే! ఇక మంచి భోజనం దొరుకుతుంది మనకు" అంటూ ఉత్సాహంగా కేకలువేశాడు చిహో. జావతెద్దామని బజారుకెళ్లాను. దుకాణదారుడు నేనిచ్చిన డాలర్ అటూయిటూ తిప్పుతూ చూశాడు.

"ఎక్కడినుండొచ్చింది నీకిది?"అంటూ అనుమానంగా అడిగాడు.

"నేనే సంపాదించాను"అన్నాను అతడిధోరణికి బిత్తరపోతూ.

"ఇది సత్తుది" అంటూ జావలాక్కున్నాడు.

"సత్తుదా! ఏమిటి నువ్వనేది?"

జవాబైనా ఇవ్వలేదతడు. తానేదో, వ్యవహారాన్ని సాగదియ్యకుండా దయతలచి వదలిపెట్టినట్లుచేశాడు. ఇక నేనుకూడా విషయం పెంచదలచలేదు. చక్కగా దర్జీదగ్గరికెళ్లాను విషయం తేల్చుకోవటానికి

"నేనేమన్నా దొంగనాణాలు వాడుతున్నాననుకున్నావా? సరి సరి నడు బయటికి, అదెవరిచ్చారో ఏమిటో"అంటూ కుత్సితంగా క్రూరంగానవ్వుతూ గెంటాడువాడు.

ఆపదలపై ఆపదలు తెరలుతెరలుగావచ్చాయి. చి-హోకు బాగాజ్వరం వచ్చింది. అసాయంత్రమే మూలుగు ప్రారంభించాడు. ఒళ్ళు మసిలిపోసాగింది. కంపితస్వరంతో పిలిచాను.

"నాన్నా, చి-హో, ఏదీ కండ్లుతెరువు. ఇటుచూడు, అమ్మనురా!" ఆ ఒక్క క్షణం స్పృహవచ్చింది.

"అమ్మా.... ఏమైందే?"

"ఇప్పుడుబాగా అవిపిస్తూందా నాన్నా ?"

"భయపడకు...."అంటూ ఏదోగుణిగి మళ్ళీ స్పృహతప్పాడు.

షువాంగ్-లిన్, పెన్-షువాంగ్‌లు కండ్లల్లో మెదిలారు. వీలైనంతతొందరగా హాస్పిటల్‌కు తీసుకెళ్లాలనుకున్నాను. పడకమీది పరుపు తీసుకొని వస్తువులు కుదువబెట్టు కునేవాడిదగ్గరికెళ్లాను. తీరా వచ్చినడబ్బు ఖర్చులాకాశాన్నంటే ఆ హాస్పిటళ్లలో ఒక్క రోజుకుకూడా సరిగా చాలేట్టులేదు. జబ్బుతో ఉన్న చిన్నవాణ్ణి బుజానవేసికొని యెన్నో హాస్పిటళ్ళకు తిరిగాను. ఒక్కరూ చేర్చుకోలేదు. చివరికి ఒక డాక్టరు దయతలచి ఉచితంగా ఏదో మందిచ్చాక ఇల్లుచేరుకున్నాం.

చలికాలమంతా పక్కబట్టలేకుండానే గడిపాం. కిష్టాలదొంతరలతో అయిదు సంవత్సరాలు గడిచాయి. పెన్-పెన్ పెండ్లిచేసికొని వెళ్ళిపోయింది. అవి చాల గడ్డు రోజులు. 'ఓ నాప్రియతమపార్టీ, ఎక్కడున్నావ్?' అంటూ నిరంతరం నన్ను నేనే ప్రశ్నించుకునేదాన్ని.

జపాన్ వ్యతిరేకయుద్ధం మొదలుకాగానే యింగ్-చీన్ "మాతృదేశాన్ని రక్షించండి" ఉద్యమంలో చేరాడు. పరిస్థితులు విషమంగా ఉన్నాయనేసాకుతో యజమాని ప్రింటింగ్ ప్రెస్ మూసివేశాడు. యింగ్-చీన్ మరికొందరు యువకులు కలిసి జపాన్ దురాక్రమణకు వ్యతిరేకంగా కరపత్రాలు వేయడానికి వాడుకున్నారు ప్రెస్. ఈవిషయం బయటపడి ఉద్యోగాలనుండి తీసివేయబడ్డారు. ఉద్యోగంపోగానే పక్కచుట్ట వీపునవేసుకొని ఇంటికొచ్చాడు యింగ్-చీన్.

"అమ్మా, దెబ్బతిన్నానే" అన్నాడు నిస్పృహగా.

"ఫరవాలేదు, ఇద్దరం కలిసి పోరాడుదాం. తల నిటారుగా ఎత్తు" అంటూ వాణ్ణి ప్రోత్సహిస్తూ నా వీపు తట్టుకున్నాను.

ఆగస్టు 13, 1937 తరువాత షాంఘైయే రణరంగంగా మారింది. ఎక్కడ విన్నా తుపాకి కాల్పులే, ఆయోమయమే. పురుషులందర్నీ బలవంతంగా సైన్యంలోకి చేర్చుకుంటున్నారు. చివరకు నేనూ నా ఇద్దరు పిల్లలు యుద్ధశరణాగతుల శిబిరంలో తేలాం.

ఏనాటికైనా స్వస్థలం చేరుకుంటామా? ఏమో. బంధువులంతా మరణించారు. ఒక అంగుళం భూమికాని విలువ సీడకాని లేకుండాపోయింది. ఎట్లా బ్రతుకుతాం, ఎక్కడ తలదాచుకుంటాం? ఒకనాడు ఒక వార్తాపత్రిక దొరికింది. దాంట్లో "కోమింటాంగ్, కమ్యూనిస్టు పార్టీలమధ్య సహకారభావం" అనే వార్త ఉంది. ఎర్రసైన్యం

ఎనిమిదవ రూట్ సైన్యంగా వ్యవస్థీకరించబడ్డట్లు కూడా ఉందందులో, కాని నేనది నమ్మలేదు.

ప్రయాణమే పార్టీతో సంబంధాలు కలుపుకోవడానికి మార్గమని హూనాన్‌కు ప్రయాణం కట్టాం.

ఇంకా ఎంతోమంది హాంగ్‌కాంగ్ వెళ్లే శరణాగతులతోపాటు మేము ఓడఎక్కాం. అక్కడి నుండి కాంటన్‌గుండా హాంకోవ్‌కు బయల్దేరాం. మా ప్రయాణం పడవ, రైలు లేదా బస్సు, అంతకంటె ఎక్కువగా కాలి నడకన సాగింది. సామానెక్కువగా లేకపోవడం వల్ల నడక అంత బాధాకరం అనిపించలేదు. యింగ్-చీన్‌కు విరేచనాలు మొదలయ్యాయి. మనిషంతా పాలిపోయి బక్కచిక్కాడు. ఒంటినిండా కురుపులులేచి నడవడం కష్టమైంది. ఒక కట్టె పట్టుకుని చి-హో, నాఆధారంగా శరణాగతుల పొడవైన లైను వెనుక కుంటుకుంటూ నడిచాడు. వేగం హెచ్చించి ముందుపోతున్నవాళ్లను కలుసుకోగలిగినా మళ్లీ వెనుకపడేవాళ్లం.

హూనాన్ రాష్ట్ర సరిహద్దుల్లో ప్రవేశించగానే జపాను విమానాలు బాంబువర్షం కురిపించటం మొదలుపెట్టాయి. నడవలేనివారు దారేపోతున్న ఒక కారును ఆపి గుంపులు గుంపులుగా జొరబడ్డారు. మా అదృష్టానికి మమ్మల్ని మేమే అభినందించుకోబోతుండగానే ఇంజన్ ఆగింది.

"ఆఁ బరువెక్కువైంది. మీలో కొందరు దిగాలి" అంటూ డ్రైవర్ గంభీరంగా చూశాడు.

తలలమీద విమానాల రొద. శరణాగతుల ప్రధాన విభాగాన్ని కలుసుకోలేకపోయామా కనీసం గంజైనా దొరకదు తాగడానికి. అయితే ఎవరు దిగాలనేదే సమస్య! మేము డ్రైవర్‌లో జాలి కలిగించాలని ప్రయత్నించాం. కాని అతడు "అయితే మీ సామాన్లను పారవేయడమొక్కటే మార్గ"మన్నాడు.

ఏం జరుగుతుందో తెలుసుకునేలోగానే డ్రైవర్ సామాన్లన్నీ గబగబ రోడ్డుమీద పారవేసి తుర్రుమనిపించాడు. ఆ దుమ్ము మసకలో రోడ్డుప్రక్కనున్న ఆకారాలు బయటికివచ్చి క్షణకాలంలో వస్తువులన్నీ ఏరుకొని మాయంకావడం పసిగట్టాం.

చి-హూ అగ్గి అయ్యాడు. "అమ్మా, వీళ్లందరిదీ ఒకే ముఠా. ఈ డ్రైవర్ అంతు తేల్దాం" అన్నాడు.

"ష్.... అంతా మరచిపో, వీలైనంత తొందరలో వుహాన్ చేరడమే ముఖ్యం. తరువాత అన్నీ అవే చక్కబడతాయి" అన్నాను.

వుహాన్ చేరగానే ఇద్దరుపిల్లల్ని వెంటేసుకొని ఎనిమిదవరూట్ సైన్యం కార్యాలయం కొరకు వెదికాను. ఈ తిరుగుడులోనే వుహాన్‌లో కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధి ఒకరున్నట్లుగా తెలిసింది. నా కామ్రేడ్లను కలువాలని ఎంతో కుతూహలపడ్డాను. కార్యాలయం చేరగానే చక్కగా లోపలికి చొచ్చుకుపోయాం. కాని ఒక బూడిదరంగు యూనిఫాం వేసుకొన్న వ్యక్తి అడ్డగించాడు.

అతడు స్నేహశీలిగానే ఉన్నాడు.

"ఎవరైనా కావాలా ?"

"అవును. కామ్రేడ్ చిన్‌పో-కు కొరకు చూస్తున్నాను"

"ఓహో అలాగా. ఇప్పుడొక సమావేశంలో ఉన్నాడాయన. ఇష్టముంటే నాతో చెప్పవచ్చు ఏ విషయమైనా."

ఏమి మాట్లాడాలో తోచక ఉత్సాహంలో ఏదోవాగాను అనాలోచితంగా. నాధోరణికి వింతపడి నవ్వుకున్నాడు కామ్రేడ్.

"ఆఁ.... ఆఁ.... ఆవేశపడకు. ఇక్కడ కూర్చొని కొద్దిసేపు విశ్రమించి కుదుటపడు. ఈలోగా కామ్రేడ్ పో-కు సమావేశంనుండి తెమిలినాడేమో చూసివస్తా"

అతడు వెళ్లి కొద్ది నిమిషాల్లోనే తిరిగొచ్చాడు.

"సమావేశం ఇంకా సాగుతునే ఉంది. ఆయన నీకు స్వాగతం చెప్పమన్నాడు; ఇదివరలో యిద్దరూ కలిసి పనిచేశారు కదూ ?"

"అవును ...." అన్నాను ఖేదామోదాల మిశ్రిమ భావాలతో పొందుతున్న కన్నీటితో. "అహా.... ఎలాగైతేనేం, నిన్ను కలుసుకున్నాను చివరికి."

గత కొద్ది సంవత్సరాల్లోని మా సంచార జీవనాన్ని గురించి తెలిపాను. అతడు శ్రద్ధగా మధ్య మధ్య తలవూపుతూ విన్నాడు.

"ఎలాగైతేనేం, పార్టీని కలుసుకున్నాను గనుక వీలైనంత తొందరగా ఏదైనా పని కావాలి చేయటానికి" అన్నాను.

"ఆఁ.... నీవు కష్టాలు పడ్డట్లుగా తెలుస్తూనే ఉంది. మొత్తానికి బాగా నెగ్గుకొచ్చావు. ఇక వసంటావా. నీవు కామ్రేడ్ పో-కును సంప్రదించవలసిందే. ఇప్పుడు పరిస్థితి మారింది. సంయుక్తదళా (United front) న్ని ఏర్పర్చాము. సంగతులు క్లిష్టంగానే ఉన్నాయి."

"ఈ కార్యాలయం త్వరలోనే చుంకింగ్‌కు మారుతుంది. అక్కడికి వెళ్లగలవా?" అన్నాడు.

పార్టీ నేను ఏది చేయాలని అంటే అదే చేస్తాను. మొదటి నుండీ నా అభీష్టము అదే. అందుకే అన్నాను, "ఎందుకు పోను? పార్టీ కొరకే ఐతే ఎక్కడికైనా పోతాను. కాని నా ఇద్దరు కొడుకులు యెనాన్ చేరాలి."

'కొడుకులు' అనగానే చి-హో ఎగిరి గంతేశాడు.

"కామ్రేడ్, నేను సైనికుణ్ణి కావాలి!"

"సైనికుడివా? ఇంతకూ నీ వయసెంత? అమ్మను వదలడానికి సిద్ధమేనా?" అంటూ చిరునవ్వుతో అడిగాడు.

"వచ్చేయేటికి పదిహేనేండ్లు. నేను, నా సర్వస్వమూ నా దేశపు సొత్తులం. 'అమ్మను వదలడానికి సిద్ధమేనా' అనడంలో నీ ఉద్దేశం?"

"ఓహో, వచ్చే యేటికి పదిహేనేండ్లా! శబాష్! నీవంటి సైనికులే కావాలి మాకు." దాంతో మొదట చి-హో జపాన్ వ్యతిరేక సేనలోను రాజకీయ విశ్వవిద్యాలయంలోను చేరాలనీ, కొద్ది రోజుల తరువాత మరి కొందరు కామ్రేడ్లతో కలసి యింగ్-చీన్ కదలాలనీ నిర్ణయమైంది

మళ్లీ పార్టీతో కలసి పార్టీకొరకు పనిచేస్తున్నానిప్పుడు. నా నరాల్లో, రోమ రోమాల్లో ఒక కొత్త శక్తి ప్రవేశించింది. ఆ రాత్రి నిద్రపోలేకపోయాను.

## 18

1938 లో జూన్ జూలై మధ్యకాలం. అవసరమైన పరిచయ పత్రం తీసుకొని చుంకింగ్‌కు బయల్దేరాను. అక్కడికి చేరిన తరువాత ఒక దర్జీ దుకాణంలో ఉద్యోగం దొరికింది. కాని దుకాణంలోని ముసలావిడ అన్ని విషయాలూ అడిగేది. ముచ్చట్లంటే చెవికోసుకునేది. అందుకే యింకెక్కడికైనా మారడం మేలనుకున్నాను. ఒక సిగరెట్ ఫ్యాక్టరీలో ప్యాకర్‌గా కుదిరాను.

సెప్టెంబర్ మాసాంతంలో పార్టీ బ్రాంచి కార్యాలయం కూడా హాంకోవ్ నుండి చుంకింగ్‌కు మారింది. కామ్రేడ్ టుంగ్‌పి-వు మరియు కామ్రేడ్ చిన్‌పో-కులతో సంబంధాలు కలుపుకుని వీలైనంత తొందరగా ఏదైనా పని చెప్పమని అడిగాను. ముఖ్యమైన కాగితాలున్న తోలుపెట్టె నొకదాన్ని యిచ్చి కామ్రేడ్ టుంగ్‌పి-వు స్నేహితుడి

కందజేసి అక్కడే ఉండమన్నారు వాళ్లు. ఈ కాగితాలు దాదాపు ఆరు నెలలు నా రక్షణలో ఉంచారు. విమానదాడి హెచ్చరిక చేసినా ఎవరినీ ఆశ్రయించలేదు. దీని తరువాత పార్టీ నాకొక పని కల్పించింది ఐదవ యుద్ధ సమయ అనాథశరణాలయంలో. ఇందులోని అనాథులు నాలుగైదేండ్లు మొదలు పదిహేడేండ్లవాళ్లు. అక్కడ పనిచేసే వారిలో కొందరు ప్రగతికాముకులు. ఆరోజుల్లో కోమింటాంగ్ ప్రతిఘాతకులు మరీ దిగజారారు. యుద్ధరంగంలో వాళ్లు 8వ రూట్ సైన్యంతో తగాదాపడ్డారు. వెనుక పాటున ప్రజోద్యమాలను దమనం చేశారు. వారి ప్రత్యేక ఏజంట్లు మరీ దారుణాలు, దౌర్జన్యాలు జరిపారు; 1943 వేసవిలో అనాథ శరణాలయంలో పనిచేస్తున్నవారిలో కొందరకస్మాత్తుగా అదృశ్యమయ్యారు. దాని వెంటనే కొందరికి పిలుపులు వచ్చాయి విచారణ నిమిత్తం. పరిస్థితి విషమించి నేనక్కడ ఉండడం కష్టమైంది. దాంతో పార్టీ నన్ను యెనాన్‌కు పంపనిశ్చయించింది.

జూన్ నెలలో మా చుంకింగ్ కార్యాలయపు లారీలో యెనాన్‌కు బయల్దేరాను. చిన్‌లింగ్ పర్వతాలుదాటి సియాన్ చేరాను. నాతో యింకా ఎంతో మంది కామ్రేడు లున్నారు. శత్రువుచేతజిక్కే పక్షంలో చెప్పడానికోకథతో సిద్ధంగాఉన్నాం అందరం. మావద్ద కోమింటాంగ్ కేంద్ర బ్యాంకునోట్లు చాలా ఉన్నాయి పెద్దవిలువగలవి.

కమ్యూనిస్టు వ్యతిరేకచర్యలకు సియాన్ ఆరోజుల్లో ప్రముఖకేంద్రము, యెనాన్‌కు వెళ్ళదలచిన ప్రగతికాముకులనూ కమ్యూనిస్టులనూ విరోధించడానికిక్కడొక సైనిక కేంద్రం స్థాపించారు కోమింటాంగ్ ప్రతిఘాతకులు. వారి ప్రత్యేక ఏజంట్లకు శిక్షణ నివ్వడానికి "యుద్ధశ్రేణులదళాన్ని" (War Cadres Corps)కూడా నెలకొల్పారు. బలహీనులను పట్టుకొచ్చి శిక్షణయిచ్చి వినాశకచర్యలకు యెనాన్‌కు పంపేవారు. సియాన్ ఉత్తరప్రాంతమంతా రాకపోకల నాటంకపరచేగోతులు, ముళ్ళతీగెతో నిండి కోమింటాంగ్ సైనిక దళాల రక్షణలోవుంది.

మా గుంపులో చాలమంది ఉన్నారు. మావెంట ఎనిమిదవ రూట్ సేన పతాకం ఉంది. అందుకే విప్లవప్రతిఘాతకులు మమ్మల్నేమీ చేయలేకపోయారు అయినా మా అందరినీ చిత్రవిచిత్రమైన ప్రశ్నలతో వేధించారు.

మేము లోయెస్ పీఠభూమి చేరుకున్నాం. ఆ రమ్యమైన విశాలదృశ్యాలు నాలోని రణాసక్తతను రేకెత్తించాయి. చాలమంది పాత కామ్రేడ్లను ముఖ్యంగా నేను యెవరి కింద పనిచేసినానో వాళ్ళను చూడగానే నా ఆనందోత్సాహాలకంతులేదు. నేను నా ఇంటి కిప్పుడు నిజంగానే చేరుకున్నాను. సంతోషంగా సులువుగా ఊపిరిపీల్చాను.

విచారణమీద యింగ్-చీన్ కేంద్ర ప్రింటింగ్ ప్రెస్‌లో పనిచేస్తున్నాడనీ, పెళ్లి చేసుకొని ఒకబిడ్డతండ్రి అయ్యాడనీ తెలిసింది. ఎన్ని మార్పులు! అప్పుడే మనుమ రాళ్లుకూడా! వెంటనే వెళ్ళి చూద్దామనుకున్నాను. కాని ఒకటి రెండు రోజుల్లో వాడే బయటికివస్తాడని తెలిసి ఊరుకున్నాను.

చి-హోను గురించి ఎవరికీ ఏమీ తెలిసినట్లులేదు. మనసు పట్టలేక సైనిక కేంద్ర కార్యాలయానికివెళ్లాను వాణ్ణిగురించి తెలుసుకుందామని. దారిలో కామ్రేడ్ తెంగ్‌యింగ్-చావొ ఆపింది.

"కామ్రేడ్ తావొ-చెంగ్; నీకు తెలియజేయజాలనందుకు మమ్మల్ని క్షమించాలి. చి-హో మూడేండ్లకుపూర్వం పోరాటంలో చనిపోయాడు."

ఆమె మాటలు నానెత్తిన పిడుగులాపడ్డాయి- ఆ వేటుకు తట్టుకోలేక తూలి పడ బోయాను. కామ్రేడ్ తెంగ్‌యింగ్-చావొ ఆదుకొని ఓదార్చింది,

"విచారించకు మనమందరమూ ఎప్పుడో ఒకనాడుపోయేవాళ్లమే- వందఏండ్లకైనాతప్పదు. పైగా చి-హో రణరంగంలో ఉత్కృష్టమైన వీరమరణం పొందాడు."

చి-హో జపాన్ వ్యతిరేక విశ్వవిద్యాలయంలో చదివేరోజుల్లోనే కమ్యూనిస్టు పార్టీ సభ్యుడైనట్లుగా తెలిసింది. పట్టభద్రుడుకాగానే 359 వ దళపు రాజకీయశాఖకు చెందిన యువకవిభాగానికి నాయకత్వం వహించడానికి పంపబడ్డాడు. ఆడుతూపాడుతూ అన్నిరకాల వినోదకార్యక్రమాల్లో పాల్గొంటూ చాల ఉత్సాహంగా చురుగ్గా ఉన్నాడక్కడ. రంగస్థల నాటకాల్లో యువతిపాత్రి నిర్వహించడంతో మిగతా కామ్రేడ్లంతా "చెల్లెల"ని ముద్దుపేరు పెట్టారు.

మా బలాలు ఆకాలంలో షాన్సిపర్వతాల్లోను, చహార్, హోపెయి రాష్ట్రాల్లోను పోరాటం జరుపుతున్నాయి. 1940 లో చాంగ్‌కై-షేక్ మొట్టమొదటిసారిగా కమ్యూనిస్టు స్థావరాలపై దాడిజరిపాడు. తన బలాలను షెన్సి-కాన్సు-నింగ్సియా సరిహద్దు ప్రాంతం లోని ఐదు పట్టణాలను ఆక్రమించుకోమని ఆదేశించాడు. 359 వ దళం పార్టీ కేంద్ర కమిటీని రక్షించడానికి శత్రువు వెనుకనుండి సరిహద్దు ప్రాంతానికి తిరిగిరావలసిందిగా ఆదేశించబడింది. దళాలు తాతుంగ్-పూచౌ రైల్వేదగ్గరి ఆటంకాలను దాటుతూండగా శత్రువు దొంగచాటుగా దెబ్బతీశాడు. చి-హో మరణించిందిక్కడే. అప్పటికి వాడి వయస్సు పదహారేండ్లు.

ఈ దెబ్బనుతట్టుకోవటం నాశక్తిని మించిపోయింది. కామ్రేడ్లెందరో నన్ను ఓదార్చడానికీ, సానుభూతితో ధైర్యం చెప్పడానికీ వచ్చారు. వారందరిపట్ల కృతజ్ఞతతో ధైర్యాన్ని పుంజుకున్నాను.

మరుసటిరోజే యింగ్-చీన్‌వచ్చాడు. నాయెదుట మోకరిల్లాడు.

"అమ్మా....నువ్వు....నువ్విన్నాళ్ళకొచ్చావా అమ్మా!"అంటూ ఏడ్చాడు.

ఇంకేమీ మాట్లాడలేక అదేపనిగా ఏడ్చాడు. మేమిద్దరం కన్నీరుకారుస్తూ పరస్పరం కౌగలించుకుంటూంటే చూచేవారికికూడా కన్నీళ్లు తిరిగాయి. వాడు నాకుచి-హోను గుర్తుచేశాడు. జీవితంలో విషాదాఘాతాలు కొత్తవేమికావు. గతంలోమాదిరే ఇప్పుడూ భరించాలి. ఇక విచారానికి తావివ్వకూడదని లోలోనే నిశ్చయించుకున్నాను.

"ఇన్నిసంవత్సరాల్లో ఏమైనా ప్రగతి సాధించావా?"

"అ... ఇప్పుడు పార్టీసభ్యుణ్ణి."

ఈ సంతోషవార్త నాకెంతో ఉత్సాహాన్నిచ్చింది.

"నేను యెనాన్‌కు రాగానే జపాన్ వ్యతిరేక విశ్వవిద్యాలయంలో క్యాడెట్‌గా చేరాను. మా ప్లాటూన్ నాయకుడు కామ్రేడ్ చాంగ్‌హోవా ఒకప్పుడు మనింట్లో ఉన్నట్లుగా చెప్పాడు."

"అవును, నీవు చిన్నవాడిగాఉండి తమ్మునితో పోట్లాడినపుడు కామ్రేడ్ చాంగ్ హోవా నిన్ను నెత్తిమీదికెత్తుకునేవాడు. నీకు జ్ఞాపకంలేదా? అయ్యో. అతణ్ని మళ్ళీ చూసేఅవకాశమే కలగలేదు, ఎంతదురదృష్టం."

నేను యెనాన్‌కు రావడానికి ఒక సంవత్సరం పూర్వమే కామ్రేడ్ చాంగ్‌హోవా మరణించాడు. హోన్యాంగ్‌లో విడిపోయినతరువాత అతడు షాంఘైకివెళ్లాడు. అక్కడి కార్మికోద్యమాల్లో చురుగ్గా పాల్గొన్నాడు. 1928 లో షాంఘైలోని పశ్చిమ జిల్లాల్లో మే 30 ఉద్యమ మూడవవార్షికోత్సవసభలు జరుపుతుండగా పోలీసులు చాంగ్‌హోవాను లాఠీలతో రక్తాలుకారేదాకా కొట్టి జెయిల్లో పడేశారు. దెబ్బలకు తలనుండి రక్తంకారుతున్నా సామ్రాజ్యవాదుల దౌర్జన్యపూరిత నేరాలను తీవ్రంగా నిరసించాడు. పోలీసులతణ్ణి ఏమీచేయలేకపోయారు. 1930 చలికాలంలో ప్రాగుత్తర చైనాకు వెళ్లాడు అక్కడి రైల్వేకార్మికులతో కలసి పనిచేయడానికి. జపాను సామ్రాజ్యవాదులచేత చిక్కి అన్ని రకాలహింసలకు గురిఅయ్యాడు. ముక్కుల్లో మంచులాంటి చన్నీళ్లు, మిరియపుపొడి కిరసనాయిలు పోసేవాళ్లు. దాంతో స్పృహతప్పేది. స్పృహరాగానే మంచులోవేసేవాళ్లు. మళ్ళీ స్పృహతప్పేవాడు. తరువాత బొటనవ్రేళ్ళకు తాడుగట్టి వేలాడదీశారు. స్పృహరాగానే సామ్రాజ్యవాదుల నేరాలను నిరసించేవాడు. ఎంతహింసించినా కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వాన్ని కాదనలేదు. అణుమాత్రపు సమాచారాన్నికూడా రాబట్టలేక పోయాడు శత్రువు. ఈ విధంగా పార్టీ ఆదర్శాలు కాపాడబడ్డాయి. తరువాత అతడు

కొమింటాంగ్ అధీనంలోవున్న ప్రాంతాల్లో పనిచేయడానికి వెళ్లాడు. దినమంతా నిరాహారంగా పనిచేసి మూర్ఛపోయేవాడు. తనకు ప్రయాణఖర్చులకని పార్టీయిచ్చే డబ్బు ఉద్యోగాలు పోగొట్టుకున్నవారి సహాయార్థం మిగిల్చాడు.

తన సర్వస్వమూ పార్టీకి ధారపోసి అమరణం విశ్వాసంగా ఉన్న అలాంటి కామ్రేడ్‌ను మరింకచూడలేను. అతడి ఆ మాటలు: "నీవు ఎంత ఎత్తుకుపోతే అంత విశాలమౌతుంది నీదృష్టి" ఎన్నటికీ మరువలేను. అతడీసలహాయిచ్చినరోజులు గడ్డువి. కాని యిప్పుడు ఆ విశాలదృష్టి కనుచూపుమేరలో ఉంది.

నా పిల్లలను, నా ఆత్మీయులను తలచుకున్నప్పుడల్లా నాకునేనే చెప్పుకునేదాన్ని: నేను ధైర్యంగా ఉండాలి; ఈ ప్రయాణం దీర్ఘకాలికమైంది; ఇప్పుడున్న చోటనే ఆగిపోరాదు. నాకుటుంబం బాధలుపడ్డమాట వాస్తవమే, కాదనను. కాని శత్రువింకా ఎన్ని కుటుంబాలను నాశనం చేయలేదు! మిగతా తల్లులు తమ పిల్లలను పోగొట్టుకోకుండా ఉండేందుకు నాపిల్లలు తమ ప్రాణాలర్పించారు. నాపిల్లలు పార్టీ శిక్షణలో విద్యాబుద్ధులు పొందారు; పార్టీ ఆదర్శాలమేరకు జీవితం నెరపారు. నేను నిశ్చలంగాఉండాలి. "నీవు ఎంత ఎత్తుకుపోతే అంత విశాలమౌతుంది నీదృష్టి," ఒక సారి ఆలోచించండి ఇప్పుడు మనదెంత అభివృద్ధిచెందుతున్న విప్లవకుటుంబమో!

నా ఆరోగ్యందృష్ట్యా పార్టీ నాకేమీ పని అప్పగించలేదు. కాని నేనప్పుడప్పుడు కామ్రేడ్ హ్సియె చుయెహ్‌త్సై నిర్వహిస్తున్న కవితా సమాజాని (Poetry Society) కి వెళ్లుతుంటాను. అక్కడ నేను కవితల్లటం నేర్చుకుంటాను. మెయి-షెంగ్ నాకు అనుప్రాసలు నేర్పేవాడు. ఇప్పుడు నేను పద్యాలు నిజంగానే రాస్తున్నాను తరుచూ విందుల్లో కామ్రేడ్లు నన్ను హునాన్ ఒపెరానుండి పద్యాలు చదవమంటూంటారు.

నేను విశ్రాంతిపూరిత సుఖజీవనానికి అస్పృష్టురాల్ని కాలేను. ఉత్పత్తిని పెంచే ఉద్యమం ప్రారంభంకాగానే నేనూ అందులోచేరి పందుల పెంపకం, కూరగాయలు పండించడం, దారం తీయడం నేతవగైరా పనులెన్నో చేశాను. బాగుచేసిన భూముల్లో తలలెత్తే పచ్చని మొక్కలను, ఇదివరకు బీళ్లుగాఉన్న భూముల నాచ్ఛాదించిన చెట్టు చేమలనుచూస్తే మళ్ళీ నా యవ్వనపు తొలిదశలో ప్రవేశించినట్లుగా అనిపిస్తుంది.

అయిపోయింది.

# రుతు సంగీతం

శివసాగర్

ఓల్గా ఘనీభవించెను!
యాంగ్సీనది పొంగెను!
హోరు హోరు హోరుగా!
హొయలు హొయలు హొయలుగా!

స్మశానాల ప్రశాంతినే
కోరి పోరు ఇనుపడేగ
జనబాణం తగిలి పగిలి
మికాంగ్‌లో కూలెను.

మదంపట్టి కదంతొక్కు
సైబీరియ తెల్ల ఎలుగు
ఉస్సూరి జలాలలో
తల మునకలు వేసెను.

ఓల్గా ఘనీభవించెను!
యాంగ్సీనది పొంగెను!
హోరు హోరు హోరుగా!
హొయలు హొయలు హొయలుగా!

శ్రమజీవుల కల్పవల్లి
క్రెమ్లిన్ అధిగోపురం
రుతువు మారి, క్రతువు మారి
భూతాలకు కాపురం.

తీన్‌మీన్‌పై ఎగిరే
అరుణారుణ పతాక
విప్లవించు జగజ్జనుల
స్వప్నాలకు ప్రతీక.

ఓల్గా ఘనీభవించెను!
యాంగ్సీనది పొంగెను!
హోరు హోరు హోరుగా!
హొయలు హొయలు హొయలుగా!

బిగియించిన పిడికిట్లో
సూర్యుడు ఉదయించెను
విశాల విశ్వక్షేత్రంలో
తెగిన తలలు రగిలెను
నేల తల్లి ఒడిలో
రాలి తార నవ్వెను

కొడవలి కొస బయ్‌నెట్‌గా
గులకరాయి బులెట్‌గా
సామాన్యుడె సాహసిగా
పరాజితుడె విజేతగా
రణరంగం మారెను.

ఓల్గా ఘనీభవించెను!
యాంగ్సీనది పొంగెను!
రుతుగీతికి పులకరించి
గంగ కూడ పొంగెను!
హోరు హోరు హోరుగా!
హొయలు హొయలు హొయలుగా!

# విశ్వాసం సడలనీకు

ఎ. ఆర్.

విశ్వాసం సడలనీకు
విప్లవమే జయిస్తుంది.
ప్రజాశక్తి అజేయమను
ఈ సత్యం మరువబోకు!

'చారు'ను వధించినారని
సమ్మయ చనిపోయాడని
మాణిక్యం మరణించాడని
నరసింహరావు పోయాడని
దామోదర్ దళమంతా
క్రూరంగా హతులయినారని
ఇంతమంది మహామణుల
కోల్పోతే యింకెట్లని
విశ్వాసం సడలనీకు
విప్లవమే జయిస్తుంది.

భారత జనముక్తి యుద్ధ
మహాదీర్ఘ యాత్రిలో
అనివార్యపు ఘటనలు యివి
మరువలేని త్యాగాలివి.

కంటకుణ్ణి తన తండ్రినె
హతమార్చిన రామాబాయ్
ఫారెస్టర్ని షూట్ చేసి
ఉద్యోగుల కందరకూ
మావో సిద్ధాంతాలను
పాఠాలుగ బోధించిన

ఉత్సాహపు సంఘటనలు
ఢిల్లీనే పట్టుకొనే
మహాశక్తి సంకేతాలు.

జనసమిష్టి ప్రతిఘటనకు
ప్రతి హింసకు తొలిరూపం
దిద్దెను గురిజాలమోతె.

నేడు నాటుతుపాకీని
చేబట్టిన మన గెరిల్ల
అదుగో అటుచూడొకపరి—
ఎల్లందు ఎల్లల్లో
బయ్యారం అడవుల్లో
బొగ్గుట్టల కొండల్లో
నల్లగొండ పల్లెల్లో
మంతెన గిరిజనాలలో
నీళ్ళల్లో చేపలవలె.

భవ్యోజ్జ్వల భారతాన్ని
నిర్మించే, నెలకొల్పే
ప్రజా మహాసైన్యానికి
పునాదులను వేస్తున్నవి

విశ్వాసం సడలనీకు
విప్లవమే జయిస్తుంది
విప్లవమే జయించడం
విశ్వసృష్టిలో సహజం.

## వ్యూహం

ఎక్స్-రే

శత్రు శిబిరం
ఆయువుపట్టుమీద వ్యూహం శరంతో
బలాన్నంతటినీ కూడదీసుకుని
విజయం మనచేతుల్లో రాలిపడేట్టు పడగొట్టు
బాయినెట్ల! చూపులనుంచి
దాక్కో
మళ్ళీ మెరుపుదాడి గురిపెట్టు
గుండెలదరగొట్టు
ఎదురుగా తలపడకు
పగలు కనపడకు
అడుగుజాడనికూడా అవతలివాళ్ళకు చిక్కనీకు
శత్రుసమీకరణ బలపడితే
వెనక్కి తగ్గు
వెన్ను చూపితే
వెన్నంటి తరుము
ముడి బిగించు
లక్ష్యానికి నిచ్చెన్లువెయ్యి
మన బలాన్ని తాసులోపెట్టి
శత్రుదళాన్ని అంచనాకట్టు
అన్నిపగ్గాలనీ ఓచేత్తోపట్టి
శత్రువును పొగల్లో కప్పెట్టెయ్యి
ఉద్యమానికి పచ్చజెండాలు ఊపుతున్న కొండల్లో
ఎర్రదీపాలమీట నొక్కు
మన సరిహద్దుపొడుగునా
పుర్రె ఎముకలబొమ్మ పెట్టు.

# కరువు!

యం. బాష

బారుల ముందు
బారులుతీర్చిన కారులయందు
ప్రజలను ఏలు
(మజాలను కోరు)
దగాకోరు ఒడానాయకులు కొందరు
వారిని నమ్ముకున్న
తమను తాము అమ్ముకున్న
వారి సహోదరులు మరికొందరు
దిగినారు.
ఐదు నిమిషాల క్రితమే
'అఖిలభారత కరువునివారణ సభ'లో
కంటకాలు తొలిగేందుకు
గట్టి యత్నాలను తలపెడ్తాం అంటూ
గట్టిగట్టి వాగ్దానాలను
ఎలుగెత్తి చాటి
కంట తడిపెట్టిన వీరు
గొంతు తడుపుకునేందుకు
పానశాలలో పాదం మోపారు!
విన్నారుగా వారినోట
గాంధీమహాత్ముని ప్రబోధాలు ఇంతదనుక.
అయితే వినండి ఇపుడు
బ్రాందీబాటిళ్ళమూతల చప్పుళ్ళలో
కోకలు విప్పుకుంటున్న క్యాబరీలమీద బూతుల విసుర్లు
వాళ్ళ ఒళ్ళు విరుపులలో నత్తగుల్లల్లా
వెచ్చగా ఒత్తిగిలిన నాయకశిఖామణుల
కన్నుల్లో కరువంతా కరిగిపోయింది.

# విప్లవ రచనలు - విమర్శ

త్రిపురనేని మధుసూదనరావు

కళాసాహిత్యరంగాల్లో విమర్శనం ప్రధానమైన పోరాటం. ఈ కళావిమర్శనంలో రెండువిధాలైన ప్రమాణాలు వుంటాయి. ఒకటి రాజకీయం. రెండు కళ. ఇందులో రాజకీయం అనేది మార్పులేని జడపదార్థంకాదు. చారిత్రక, సాంఘిక పరిణామాలను అనుసరించి రాజకీయం నిరంతరం మారుతూవుంటుంది. ఒక చారిత్రికదశలో విప్లవ పాత్ర నిర్వహించిన రాజకీయం మరొకదశలో విప్లవ సాధనం కాకపోవచ్చును. ఈ చారిత్రికదశఅనేది కొన్ని స్పష్టమైన భౌతికసూత్రాలమీద ఆధారపడి వుంటుంది. ఈ సూత్రాలే ప్రజలకు వ్యవస్థను మార్చే అవసరాన్ని, సంకల్పబలాన్ని, పోరాటవిధానాల్ని నిర్ణయిస్తాయి. ఒక కవితలోని రాజకీయ తత్వాన్ని విశ్లేషించాలంటే శాస్త్రీయ చారిత్రికతత్వమే ప్రమాణంగా గ్రహించవలసి వుంటుంది. ఇక్కడ రాజకీయం అనే మాటను చాలా విస్తృతార్థంలో గ్రహించాలి. సంఘం, తత్వం, చరిత్ర, జీవితం అన్నీకలిపే రాజకీయం అనే పేరుతో పిలుస్తాం. పరిభాషమారటమే కాని రాజకీయ స్పర్శ లేకుండా కళకు అస్తిత్వమేలేదు. యుగస్వభావాన్నిబట్టి ఒక కాలంలో జీవితపరిభాషను మరొకదశలో మతతత్వ పరిభాషను రాజకీయం ఆశ్రయిస్తుంది. వ్యాసుడు, వాల్మీకి ప్రాచీన గ్రీకు కవులు చివరకు డాంటీ. మిల్టనులుకూడా రాజకీయాలే రాశారు. పరిభాష ముసుగును తొలగించిచూస్తే ప్రతికవిలోనూ రాజకీయం స్పష్టంగా కనిపిస్తుంది. ఈ కారణంగా కవితను రాజకీయ ప్రమాణంతోనే మొదట పరిశీలించాలి. కవి ఎవరి పక్షాన నిలబడ్డాడు? అతని దృక్పథం ఎవరిని, ఏవిధానాన్ని సమర్థిస్తున్నది? వర్గదృష్టి, విప్లవతత్వం ఏమేరలోవున్నాయి? అనే విషయాల్ని మొదట విశ్లేషించాలి. ఆతర్వాత సాహిత్య ప్రమాణంతో కవితను అనుశీలించాలి, రాజకీయ ప్రమాణాలే సాధారణంగా కళాస్థాయిని నిర్ణయిస్తాయి. రెండింటిని నిర్ణయించేది చారిత్రికదశే దీన్ని విప్లవ వాస్తవికతఅన్నా యిబ్బందిలేదు. ప్రజలలో చైతన్యాన్ని రగిలించేది, ఆలోచనాపరుల్ని విప్లవ భావాభిముఖం చేసేది యీనాటి రాజకీయ దృక్పథం. సాగుతున్న ప్రజాపోరాటాల్ని చిత్రించటం, విప్లవకారుల వీర పోరాటాలను, సాహసాలను ప్రజలకు ఎరుకపరచటం యీనాటి విప్లవ రాజకీయ దృక్పథం, ప్రజాతంత్రం శవప్రాయమై, ఎన్నికలు కొంతమందికి సంబరాలై, ఇప్పుడు అమలులోవున్న విధానాలన్నీ ప్రజలకు శత్రువుగా మారిపోయినవైనాన్ని మార్క్సిజం, లెనినిజం ప్రాతిపదికగా నిబద్ధమై నిబంధిం

చటమే విప్లవ రాజకీయం ప్రజాసమూహం ఒకే మనస్సుతో పురోగమింపజేసే ఆదర్శం కవి ఆశయం కావాలి. ప్రజల్లో అవిశ్వాసాన్ని అంటించేది. సందేహతత్వాన్ని ఆవేశింపచేసేది తప్పుడు రచన కవి ఆశయం- సాంఘిక ప్రభావం. ఈ రెండింటిలో ఏదిముఖ్యం? భావవాదులు కవి ఆశయాన్ని గుర్తించి ఆచరణాత్మక ప్రభావాన్ని విస్మరిస్తారు. యాంత్రిక భౌతికవాదులు ఆచరణను గుర్తించి ఆశయాన్ని పట్టించుకోరు. మార్క్సిస్టులకు కవి ఆశయం- ఆచరణాత్మక ప్రభావాల ఐక్యత లక్ష్యం. ప్రజలకు సేవ చేయాలనే కవి ఆశయం ప్రజల అంగీకారాన్ని పొందాలనే ఆచరణాత్మక స్థితితో కలిసివుండాలి. ఒక వ్యక్తికో, పరిమిత సంకుచిత ఆశయాలుగల కొద్దిమందికో సేవ చేయాలనే ఆదర్శం చెడ్డది. ప్రజల అంగీకారంతో పనిలేకుండా వాళ్లకు వుపయోగించాలనే ఆచరణస్థితిలేకుండా 'ప్రజారచన' అనిపించుకోవటం సాధ్యంకాదు. కవి లక్ష్యం సరిఅయినదా కాదా అనే విషయం అతని సిద్ధాంత ప్రకటనంతో కాక రచనల ప్రభావాన్నిబట్టీ నిర్ణయించాలి. కవి వ్యక్తిగతఆశయం మంచిదా కాదా అనేది సాంఘిక ఆచరణ, ప్రభావాలే నిర్ణయిస్తాయి. శాస్త్రవిజ్ఞానాన్ని, ప్రజల్ని విప్లవ రాజకీయ పక్షాన్ని వ్యతిరేకించే కవిని పూర్తిగా నిరసించటం, అతని అభ్యుదయ వ్యతిరేక సాంస్కృతిక వ్యక్తిత్వాన్ని నగ్నంగా ప్రజలముందు వుంచటం విప్లవ విమర్శకుల బాధ్యత. వున్నత కళాత్మకతవున్న విప్లవ రాజకీయ నిబద్ధమైన రచన ఉదాత్త రచనగా, తక్కువ కళాత్మకతవున్న నిబద్ధరచన రెండవరకం రచనగా నిర్ణయించవలసి వుంటుంది. ఈ నిర్ణయంకూడా విమర్శకుని వ్యక్తిగత వూహలమీదగాక ప్రజలపై రచన ప్రభావాన్ని బట్టీ జరుగుతుంది. రాజకీయ కళాప్రమాణాలకువున్న సంబంధం ఏమిటి? రాజకీయం, కళ రెండూ ఒకటే అనుకోకూడదు దేనికి ఏది ప్రత్యామ్నాయంకాదు. అస్పష్టమైన, అతీతమైన, మార్పులేని రాజకీయ ప్రమాణంకానీ, కళా ప్రమాణంకానీ వుండవు. వర్గ సమాజంలో ప్రతివర్గానికీ ప్రత్యేకమైన రాజకీయ, కళా ప్రమాణాలు వుంటాయి. అన్ని వర్గసమాజాల్లోనూ. అన్నివర్గాలూ రాజకీయ ప్రమాణానికి మొదటిస్థానం, కళా ప్రమాణానికి రెండవస్థాం ఇస్తాయి. ఎంతటి కళాదీప్తివున్నా- ధనస్వామ్య వ్యవస్థ శ్రామిక కవిత్వాన్ని, కళల్ని ఏహ్యభావంతో చూస్తుంది. ప్రచారానికి రానివ్వకుండా అన్నితలుపులూ మూసివేస్తుంది. పాలకవర్గాన్ని సమర్థించే రాజకీయ దృక్పథంవున్న రచనలకు, కళాత్మకత లేకపోయినా అనుకరణ, అయోమయం అభరణాలుగావున్నా సహజంగానే ప్రతిష్ఠవస్తుంది. అదే వున్నతకళగా పరిగణించటం సంభవిస్తుంది. శ్రామికులుగూడా పాతకాలపు కవిత్వాన్ని, సమకాలిక రచనలను ప్రజాప్రాతిపదికమీదే అంగీకరించాలి రాజకీయంగా తీవ్ర తిరోగామి దృక్పథంకల కొన్ని రచనలు కళాపరంగా వున్నతస్థాయిని సాధించవచ్చును. వస్తువు విప్లవ వ్యతిరేకమై, శిల్పం రమణీయంగా

వుంటే అది ప్రజలకు విషప్రాయం అవుతుంది. అలాంటి రచనలను విప్లవ విమర్శకుడు శాస్త్రీయంగా విశ్లేషించి తిరస్కరించాలి. దోపిడీవర్గాల పతనదశలోని కవిత్వంలో వస్తు, శిల్పాలకు వైరుధ్యంవుంటుంది. మనంకోరేది రాజకీయాలకు, కళకు ఐక్యత, వస్తుశిల్పాలకు ఐక్యత. రాజకీయంగా అభ్యుదయదృష్టి వుండి కళాపరంగా హీనరచనలకు శక్తివుండదు. కాబట్టి ప్రజా వ్యతిరేక రచనలను, కరపత్రాల, నినాదాలశైలిలోవున్న అభ్యుదయ దృష్టివున్న రచనలనుకూడా తిరస్కరించవలసిందే. ఇప్పుడు మనంవున్న చారిత్రికదశలో రాజకీయం కళాప్రమాణాలకంటే ప్రాధాన్యం వహించాలి. ప్రాథమిక రాజకీయ పరిజ్ఞానంలేకుండా రాసే రచనలు ఈ దశలో చాలా కీడు చేస్తాయి.

## 2

భారత దేశంలో గడచిన దశాబ్దం రాజకీయంగా కల్లోలిత దశాబ్దం. శ్రామిక పక్షం క్రమంగా విప్లవమార్గానికి తిలోదకాలిచ్చింది నగ్న వుదారవాద సుడిగుండంలో పడిపోయింది. ఎన్నికలమీద, పాలకపక్షం మీద మమత పెంచుకుంది. అభ్యుదయ అభాసాల్ని అరుణాభ్యుదయంగా స్వీకరించటం ఆరంభించింది. గ్రామాల్లో ఫ్యూడల్ విధానాలు, నగరాల్లో ధనస్వామ్యం కోరలు విప్పి ఒకదాని కొకటి సహకరించుకుంటూ కార్మికుల్ని, కర్షకుల్ని దారుణంగా దోపిడీచేయటం ఆరంభించాయి. సోషలిస్టు సిద్ధాంతాలను వల్లిస్తూ పాలకులు పెట్టుబడిదారుల్ని ఫ్యూడల్ స్వాముల్ని అన్నివిధాలా ముద్దు చేసి పెంచారు. బాబాలు, యోగులు, పీఠాధిపతులు ఇంకా మతోన్మాద జాతీయ శక్తులు లౌకిక రాజ్యాంగం ముసుగులో ఆధ్యాత్మిక రంగాన్ని పవిత్రం చేయటం ఎక్కువైపోయింది. విద్యావిధానం విదేశాల్ని అనుకరిస్తూ కాలదోషంపట్టిన పాఠ్యాంశాలతో శవప్రాయమై నిరుద్యోగుల్ని, భట్టీయం విద్యావంతుల్ని వుత్పత్తిచేయటం ఆరంభించింది. ఉద్యోగులు పాలకపక్షం పాదాలు నాకుతూ అప్పుడప్పుడు అణా పైసలకు సమ్మెచేస్తూ ప్రజల దృష్టిలో విదూషకులై జీతాల జిజ్ఞాసువులుగా మిగిలిపోయారు. కవులు పండుగ పబ్బాలమీద, నాయకమ్మన్యులమీద, హీం పీరుల్ని వీరులుగా చిత్రించటంమీద దృష్టిని లగ్నంచేసి సినిమా సుందరి కటాక్ష వీక్షణంకోసం, అకాడమీల ఓచ్చంకోసం పడిగాపులు పడుతున్నారు. ఇక కుండలాల పండితులు వీర గ్రాంధికంలో జ్ఞానావశిష్టాలు రాస్తూ పాలకపక్షంతోనూ, విశ్వవిద్యాలయాలతోనూ కనకాభిషేకం చేయించుకుంటున్నారు. పండితులందరూ అగ్రహార మనస్తత్వంలో కూరుకుపోయారు. ఈ సాంఘిక వాతావరణంలో పీడితుడు దిక్కుతెలీని నిస్సహాయ స్థితిలో దారిద్ర్యం కవచంగా, అనారోగ్యం ఆహారంగా, అజ్ఞానం జీవితఆశయంగా కన్నీటిలో స్నానంచేస్తూ ఆకాశం

పందిరికింద గజ్జికుక్కలతో, ముసలిపందులతో సహజీవనం చేస్తున్నాడు. ఊరి చివర ఆకులు పువ్వులులేని చెట్లకింద దుమ్ము నిండిన వొంటితో శోషిల్లిన కళ్లతో కదలటానికి శక్తిలేకుండా సగం చిరిగిన మురికిబట్టలతో పక్కన ఏవో నల్లగింజలు పోసుకొని ఒక్కొక్కచే నములుతూ మృత్యువు అంచునపడిన లక్షవాది జనం - నగరం మధ్య గర్వంగా రక్తరాక్షసిలా తలఎత్తిన పెద్ద హోటల్ భవనాల పక్క చెత్త కుండీల్లో తాగిన వాళ్లు కక్కిన అన్నంకోసం క్యూలో నిలబడ్డ వేలాది జనం- మిల్లుల్లో యంత్రాలకు కండరాల్ని అర్పించి, వీధుల్లో ఎముకలు విరిగేటట్లు చెమటే మనిషిగా మారిన కార్మికులు, రిక్షావాలాలు- పొలాల్లో క్షణం నడుంవంచక పనిచేసే రైతు కూలీలు, రక్తంబొట్లతో తడిసిన సర్టిఫికేట్లతో యువత చచ్చి. సాహసోద్రేకాలు యింకి, ఆత్మగౌరవం పారేసుకుని కాళ్లు విరిగేటట్టు తిరుగుతున్న నిరుద్యోగులు- సమాజ రంగంలో ఎక్కడచూచినా క్రూర దీనత్వమే. క్షణక్షణం మానవతకు అవమానమే- ప్రజల్ని విప్లవోత్తేజంతో సమీకరించాల్సింది పోయి కమ్యూనిస్టు పార్టీ అనేది అన్ని రంగాల్లోనూ 'రాజీ' మనస్తత్వాన్ని పెంచుకుంది. ఎత్తుగడల పేరుతో సర్వ ప్రజా కార్యక్రమాలకీ వుద్వాసన చెప్పింది ఇటు ప్రజల్లో నమ్మకాన్ని కోల్పోవటమే కాక అటు విద్యార్థుల్లో, యువ తరంలో కూడా తన ప్రభావాన్ని కోల్పోయింది. రాజకీయ పాఠశాలలు ప్రజా సంస్కృతీ పునరుద్ధరణలను కూడ అనాసక్తంగా మాత్రమే నిర్వహించింది. ఎన్నికల మీద నమ్మకం వుండకూడనిది ఎన్నికల్లో వోడిపోవడంతో నీరుకారిపోవటమే ఆశ్చర్యం. భారత దేశంలోని సాంఘిక పరిస్థితుల్ని ఉపరితలంలో గమనించినా ఎన్నికలద్వారా శ్రామిక ప్రభుత్వం వస్తుందనుకోవటానికి ఏమాత్రం అవకాశంలేదు. అంతర్జాతీయ సైద్ధాంతిక నీడల్లో తమ అనాసక్తతను కప్పిపుచ్చుకోవటానికి ప్రయత్నించారు. విప్లవానికి తరుణం రాలేదని ఇంకా దారిద్ర్యం బాధపడవలసినంత పెరగలేదనీ, పార్లమెంటరీ పద్ధతుల్లో సమస్యల్ని పరిష్కరించుకోవచ్చుననీ కాలం గడపటం ఆరంభించింది. దేశ, విదేశీయ సంఘటనలు పార్టీ నాయకత్వంలో కార్యకర్తల్లో వైరుధ్యాల్ని, సైద్ధాంతిక వైషమ్యాల్ని తీసుకొచ్చాయి. ఫలితంగా పార్టీ రెండు ముక్కలయింది. ఇవతలకు వచ్చినవాళ్లు ప్రజల్లో ఆశలు చిగురింపచేసే ప్రసంగాలు చేశారు. లోపల అనేక విషయాలమీద తీవ్ర చర్చలు జరిగాయి. ఇంతలో నిషేధం, వేలాది నాయకులు, కార్యకర్తలు జైళ్లలో నిర్బంధింపబడ్డారు. ఒక సంవత్సర కాలం రాజకీయంగా విపరీత సంచలనం వచ్చింది- నిర్బంధం సడలింపు, మళ్లీ ఎన్నికలు- ఉభయపక్షాలు ఎన్నికల్లో పాల్గొన్నాయి- మళ్ళీ అంతా మామూలే. ఆశలు రేకెత్తిచ్చిన వాళ్లు చక్రం అడ్డు తిప్పారు. రెండు ప్రాంతాల్లో అధికారం వచ్చినా పార్లమెంటరీ పాముకాటు తిని కూడా బుద్ధిమాంద్యం పెరిగి వేదికలేని పక్షంగా శేషించింది. ప్రస్తుతం రెండు పక్షాలూ

పరస్పర యుద్ధంలో మునిగి వున్నాయి. ఈ రకం స్థితిని భరించలేని యువతరం, విప్లవతరం విప్లవాగ్ని లేవదీసింది. అరణ్యాల్లో అగ్గి అంటుకుంది. కొండలు ఎరుపెక్కాయి. కోటి తుపాకులు గురిపెట్టి లక్షలాది జైళ్ళనోరుతెరిచినా జీవితాల్ని పణం పెట్టి విప్లవతరం సాగిపోతోంది. పాలక పక్షం కొత్త ఎత్తులతో, తమకే నమ్మకంలేని నినాదాలతో ప్రజల్ని మభ్యపరుస్తోంది. వేలమంది విప్లవకారులు ప్రాణాల్ని అర్పించారు. పెద్ద ఎత్తున ప్రభుత్వం హింసాకాండను జరిపిస్తోంది. అయినా విప్లవ తరంగం ఆగదు. ఇవ్వాళో రేపో, ఈ దేశంలో శ్రామిక విప్లవ ప్రభుత్వం వస్తుందని ఎవరూ అనలేరు. అలాగని భారతదేశంలో అసలు విప్లవమే అసంభవమనే నైరాశ్యవాదాన్ని సమర్థించేవాడు పచ్చి విప్లవ వ్యతిరేకి. సుదీర్ఘ పోరాటం ఒక్కటే విప్లవానికి సాధనం. లక్షలాది విప్లవ వీరుల త్యాగం అరుణ సంస్కృతిని ఆవిర్భవింప జేస్తుంది. దేశంలో నాలుగు పక్కలా అంటుకొని మండుతున్న విప్లవాగ్ని విశాలంగా వ్యాప్తమయివున్న వ్యవస్థ నాశనమై తీరుతుందన్న చారిత్రిక ఆశయమే విప్లవ విశ్వాసం. ఏది నిజమైన విప్లవ రాజకీయ పక్షమో ప్రజలకు ఇప్పుడిప్పుడే అర్థమవుతోంది. కొద్ది కాలంలోనే దేశంలో నానా చిల్లరపార్టీల ప్రభావం నుంచీ, పాలక పక్షం మత్తునుంచీ ప్రజలు బయటపడతారు. జాతీయ విముక్తి పోరాటం అనివార్యంగా ముందుకుపోతుంది.

## 3

మధ్యతరగతి అనేది శాస్త్రీయంగా ఒక వర్గం అనటానికి అవకాశంలేదు. అది వొక మనస్తత్వం మాత్రిమే. ఈ మధ్యతరగతి అనబడేవాళ్లలో ఫ్యూడల్ సంస్థ పగిలిపోగా మిగిలిన గాజు పెంకులాటి వాళ్లు కొందరుంటారు. ఆర్థికంగాచూస్తే చిన్నచిన్న చిల్లర భూస్వాములు మధ్యతరగతిగా పరిగణించబడుతూంటారు. వీళ్లు అటు పెట్టుబడిదారులకు గులాములుగా వుంటారు. లేదా క్రమంగా ధనస్వామ్య వ్యవస్థను తట్టుకోలేక శ్రామిక స్థితికి దిగజారిపోతారు మరొకరకం బుద్ధి జీవులు. ప్రపంచంలో ఆధునిక యుగాన్ని పరిశీలిస్తే అన్ని రంగాల్లోనూ ఈ రకం మధ్యతరగతి వాళ్లు విప్లవపాత్రను నిర్వహించారు. అమానుషమైన అభ్యుదయ వ్యతిరేకపాత్రనూ నిర్వహించారు. మార్క్స్, ఎంగిల్స్, స్టాలిన్, లెనిన్, మావో, గువేరా, డార్విన్, న్యూటన్, ఐన్‌స్టీన్‌లు మధ్యతరగతి వాళ్లే. హేతువాద శాస్త్ర విజ్ఞానానికీ, మరో ప్రపంచ సృష్టికీ విప్లవ కవాటాలు తెరచినవాళ్లూ నవ్యమానవ సంస్కృతిని స్థాపించినవాళ్లూ మధ్యతరగతిలో కనిపిస్తారు. అయితే వీళ్ల ఈ స్థితిని మధ్యతరగతి వలయాన్ని

ఛేదించగలిగినప్పుడే చేరుకోగలిగారు. శ్రామిక జీవితంలో కలసిపోవటం వల్ల, దారి త్రిక యదార్థ తత్వాన్ని గ్రహించటం వల్ల మధ్యతరగతిలో ప్రముఖ భాగం విప్లవ ప్రవాహంలో తరంగాలు అవుతారు. వర్గ పరివర్తనం జరిగి సుదీర్ఘ విప్లవానుభవంతో కార్మికవర్గ చైతన్యాన్ని పొందుతారు. దీనికి మావో జీవితమే ప్రమాణము. విద్యార్థిగా వున్నప్పుడు తన సామాను తాను మోయటం అసహ్య మనుకునేవాడట. మేధావులు మాత్రమే శుభ్రంగా వుంటారని శ్రమ జీవులు అపరిశుభ్ర జీవులని అభిప్రాయపడే వాడు. క్రమంగా పీడితుల పక్షాన నిలబడి విప్లవనాయకత్వం వహించిన తరుణంలో శ్రమజీవుల శుభ్రతను అర్థంచేసుకోగలిగాడు. ఇలా మావో మధ్యతరగతి పనికిమాలిన మనస్తత్వాన్ని ఆచరణలో వదలిపెట్టి విప్లవనాయకుడు కాగలిగాడు. మధ్యతరగతి మనస్తత్వంలో కూరుకుపోయిన కోట్లాది రైతాంగాన్ని లాంగ్‌మార్చ్ చేయించాడు. ఈ రోజున ఇక్కడ జరుగుతున్న సాయుధ ప్రజావుద్యమంలో 'మధ్యతరగతి' పాత్ర ప్రముఖమైందే. విప్లవం మధ్యతరగతి తీసుకొస్తుందని కార్మిక, కర్షకపక్షం లేకుండా శ్రామిక ప్రభుత్వం స్థాపించవచ్చునని దీని అర్థంకాదు. విప్లవ ఆచరణలో మధ్యతర గతి కూడా క్రమంగా విప్లవీకరించబడి ప్రజా సంస్కారాన్ని పొంది విప్లవంలో శాస్త్రీయ మైన పాత్ర నిర్వహిస్తారు. మధ్యతరగతి బుద్ధి జీవుల్ని కార్మికులుగా విప్లవకారులుగా మార్చటంలో ధనస్వామ్య వ్యవస్థకూడా పరోక్ష కారణం అవుతుంది. ఈ కారణాల వల్ల మధ్యతరగతి అనేది 'వర్గం' కాదు. అయితే బుద్ధిజీవుల విప్లవీకరణకు విప్లవ కార్యాచరణ ఒక్కటే మార్గం. సిద్ధాంత ప్రకటనలు, సానుభూతి ప్రమాణాలు కావు. ఈనాటి ప్రజా వుద్యమం చారిత్రిక దశాయోగ్యమైన పోరాటాన్ని ఎన్నుకుంది. ఈ వుద్యమంలో మధ్యతరగతివాళ్లు కూడా అధికసంఖ్యలో వున్నారు. ఇప్పటికే చాలా మంది శ్రామిక విప్లవతత్వాన్ని అలవరచుకున్నారు. ఇది సుదీర్ఘ విప్లవం. మధ్యతర గతి చైతన్యవంతులు కార్మికులు ఏకమై విస్తృత విప్లవ కార్యాచరణకు సన్నద్ధమయ్యే దశ రానున్నది. విప్లవ ధుంధుని జైళ్లు, తుపాకులు, స్టాండింగ్ ఆర్మీలూ ఆపలేవు.

విప్లవ వుద్యమం ఇలావుంటే విప్లవ రచయిత లందరూ మధ్యతరగతివాళ్లే. నిజమైన విప్లవ రచన విప్లవ కార్మికులనుంచే రావాలి, వస్తుంది. దానికి ఆరంభంగా మధ్యతరగతి విప్లవ రచనలు వస్తున్నాయి. రచనల్లో మధ్యతరగతి అనిశ్చిత మనస్తత్వం కాల్పనిక ఆవేశం, వాతావరణం, శబ్దప్రయోగం, శైలి క్రమంగా– రచన, వుద్యమ ప్రభావం, నిరంతర సిద్ధాంత అధ్యయనం చిత్తశుద్ధి సాధనాలుగా విప్లవీకరించబడు తున్నాయి. వస్తు శిల్పాల్లో విప్లవ రచయితలు విప్లవ ప్రజా సాహిత్యాన్ని సృష్టించ టానికి అలసటలేని ప్రయత్నం చేస్తున్నారు. రాచకొండ కథల్లో శిల్ప వైచిత్రి ప్రజా వస్తువును పిపీలికం చేస్తున్నది. అంత శిల్ప వ్యామోహం ప్రజాకవికి వుచితం కాదు,

సూటిగా, స్పష్టంగా, నిరాడంబరంగా 'వీధిమనిషి' భాషలో మాటగా, పాటగా సంభాషణగా వుండే విప్లవ రచనలు చాలామంది యువకులు చేస్తున్నారు. శ్రీశ్రీ అన్నట్టు 'విప్లవ రచన' తెలుగునాట ఇప్పటికి విజయవంతమైంది. గ్రంథాల నుంచి భాషను నేర్చుకోవటం, అధికమైన శిల్ప లాలసత్వం విప్లవ రచనల్లో కనిపించకపోవటం గొప్ప లక్షణం. విప్లవ కవులమీద విప్లవాభిమానులు చేస్తున్న విమర్శలకు మధ్యతరగతి మనస్తత్వమే కారణం. ఆ విమర్శకులు, మధ్యతరగతి సంస్కార పరిధిలోనే ఖండన మండనలు చేస్తున్నారు. సుదీర్ఘ సాంస్కృతిక పోరాటంలో విమర్శ ప్రతివిమర్శలతో, జాతీయ బూర్జువా రచయితల, పాలకపక్షాల వొత్తిడిని ఎదుర్కొంటూ విప్లవ కవులు ప్రజా విప్లవ కవులుగా పరివర్తనం చెందుతారు. పాణిగ్రాహి కవిత్వంలో ప్రజాశైలి వున్నా 'భావ వాతావరణం' మధ్యతరగతి విప్లవ నిమగ్నకవిదే.

సాహిత్య వ్యాసాలు II

## సాహిత్య రచన (1934)

గోర్కీ

చాలామంది ఆలోచించేదీ, వాదించేదీ జీవిత వాస్తవికతను తెలుసుకుందామని కాదు- తిరుగులేని సత్యాలను స్థాపించి ఇక ఆలోచించటం మానేద్దామని. తిరుగులేని సత్యాలను తయారుచేయాలనే ఈ తొందరపాటు విమర్శకుల్లో ఎక్కువగా కనిపిస్తుంది. సృజనాత్మక రచనలను ఇది చాలా దెబ్బతీస్తుంది. రచన గొప్ప బాధ్యతతో కూడినది. పిడివాదం, గుడ్డి నమ్మకం హ్రస్వ దృష్టికి, వక్రదృష్టికి దారితీసి జీవిత వాస్తవికతను తారుమారు చేస్తాయి. అందుకే ఎంగెల్స్ "మార్క్సిజం పిడివాదంకాదు. మార్గదర్శి" అన్నాడు. మన ప్రయత్నాలన్నీ కూడా పాత సమాజాన్ని మార్చి కొత్త సమాజాన్ని నిర్మించడానికే.

మాటలద్వారా పాత్రలను, రూపాలను చిత్రిస్తుంది సాహిత్యం. మాటల్లో సంఘటనలను, వాస్తవాలను, ప్రకృతి దృశ్యాలను, ఆలోచనా సరళిని ప్రతిబింబిస్తుంది సాహిత్యం. అలాంటి సాహిత్యంలో ప్రధానాంశాలేమిటి?

సాహిత్యంలో మొట్టమొదటి అంశంభాష. అసలైన పనిముట్టు అదే. జీవిత వాస్తవాలు, దానిముడి సరుకులు. "భాష"గురించి ఓ చమత్కారమైన పొడుపుకథ

ప్రిచారంలోవుంది. "అది తేనెలాగా తియ్యగాలేకపోయినా జిగురులా ప్రితిదానికి అంటుకుంటుంది." అంటే ప్రిపంచంలో ప్రితిదానికి భాష పేరు కల్పిస్తుందని అర్థం. వాస్తవాలకు, ఆలోచనలకు మాట వస్త్రధారణలాంటిది. ప్రితి వాస్తవం వెనకాల సాంఘిక ప్రిత్యేకత దాగి వుంటుంది. అలాగే ప్రితి ఆలోచనవెనక సబబు సందర్భ శుద్ధి కూడా వుంటాయి. జీవిత వాస్తవాల వెనకాలదాగిన సాంఘిక సత్యాలను, వాటి ప్రత్యేకతను వెల్లడించడమే సాహిత్య ప్రియోజనం. ఈ ప్రియోజనం నెరవేరాలంటే మనంవాడే మాటలు కచ్చితంగా, తేటతెల్లంగా వుండాలి. గొప్ప రచయితలు భాషను అలాగే వాడేవారు. శతాబ్దాల తరబడి భాష అలాగే పెంపొందింది భాష జనం వాడుకలోనుంచే పుడుతుంది. వాడుకభాషే మనంరాసే భాషకుపునాది. పుస్తకంలో పాత్రిలు నిత్యజీవితంలోవే, అందువల్ల అవి వాడుకభాషే మాట్లాడతాయి.

చిన్నతనంలో నేనుకూడా కొత్తమాటలు తయారుచేద్దామని తాపత్రయపడేవాడిని లాయర్లు కోర్టులోవాడే కృతకభాష నన్నందుకు పురిగొల్పింది. కాని ఇవన్నీ వ్యర్థ ప్రియత్నాలని తర్వాత తెల్సుకున్నా. చెప్పేవిషయం మంచిదైనా, చెడ్డదైనా మాటలు అందంగానే వుండొచ్చు. ఎలాగంటే కోర్టుల్లో వాదితరపు వకీళ్ళు, ప్రితివాదితరపు వకీళ్ళుకూడా ఒకేరకంగా ఎంతో ఒడుపుతో పదాలనుచెక్కి మరీ ప్రియోగిస్తారు. కొత్త మాటలు తయారుచేద్దామని ఎన్నోకాపీలు పుస్తకాలు చెడగొట్టా. ఇదో చంటిబిడ్డజబ్బు. వాస్తవికత వైద్యుడిలాగా నాజబ్బు పోగొట్టింది.

ఉత్పత్తిశక్తులు మారినప్పుడు, వర్గవైరుధ్యాలు తీవ్రితరం అయినప్పుడు భాష చాలావేగంగా అభివృద్ధిచెందుతుంది. మన సంస్కృతి, చరిత్రి ఈమాటే చాటి చెబుతున్నాయి.

అంతేకాదు, మన జానపద సాహిత్యం, సామెతలు, నానుడులు, పల్లెపాటలు ఈమాటే నొక్కిచెబుతాయి. వాడుకభాష సహజసిద్ధంగా ఇలాగే అభివృద్ధిచెందుతుంది వాడుకలోలేని పాతమాటలు ఉపయోగించడం (ఉదా:- విశ్వనాథ (అను:) ) దండగ. అలాగే సరికొత్త మాటలుకావాలని తయారుచేయడం (ఉదా:- ఆరుద్రి (అను:))కూడా దండగే, మాస్కోలో జనం ఎలా మాట్లాడుతున్నారో వినేవాడు పుష్కిన్. లెస్కోవ్ వాడుకభాషలో సాటిలేనిమేటి. ఆతనిదగ్గరో నర్సుండేది. ఆమె మొగుడు సిపాయి, ఆమెదగ్గర బోలెడు నుడికారం నేర్చుకున్నాడు లెస్కోవ్. అమాయకజనం, జట్కావాళ్ళు, జాలరులు, బోయవాళ్ళు, ఇతర పాటకజనం వీళ్ళంతా భాషను సంపన్నం చేస్తారు. వాడుకభాష సెలయేరులాంటిది. రచయితలు ఆ సెలయేటినుంచి తేటమాటలు సూటిమాటలు, పసందైనమాటలు ఏరుకుంటారు. (గురజాడ, రావిశాస్త్రిలాగా.(అను:))

సాహిత్యంలో రెండోఅంశం వస్తువు. ఈ వస్తువు రచయిత అనుభవంలోంచి వస్తుంది. ఈ అనుభవం జీవితమేనేర్పుతుంది. రచయిత మెదడులో ఆకారంలేకుండా దాగివున్న ఈ అనుభవం తనకు కళ్ళకుకట్టినట్టు చిత్రించమనీ, తనకో ఆకారంఇమ్మనీ, గద్దించి అడుగుతుంది.

అన్నిరకాల వస్తువులువున్నాయి. చావు, పుట్టుకలాంటివి 'శాశ్వతవస్తువులు' మరికొన్ని సాంఘిక పరిస్థితులవల్ల ఏర్పడేవి. ఇవి మనిషి మనసులో వేళ్ళూని వుంటాయి- అసూయ, పగ, దురాశ వగైరా. "ప్రతిదీ మారుతుందని", "ఏదీ కల కాలం ఒకేరకంగా వుండదని" ఏనాడోచెప్పారు. విశ్వంలో విప్లవ భానూదయంవల్ల ఒకసంగతి తేటతెల్లమయింది. 'శాశ్వతవస్తువు'లకు మూలం మనిషి ఒంటరితనమే. ఈ ఒంటరితనానికి కారణం తీవ్రమైన సంఘర్షణమీద ఆధారపడిన సమాజమే. సమాజంలో అన్నంకోసం ఆధిక్యంకోసం ఒకరితో ఒకరు కొట్లాడుకోవాలి. ఈ ధన స్వామ్య సమాజంలో ఓ గమ్మత్తుంది. కేవలం కనీసావసరాలకోసం చాలామంది తమ సర్వశక్తులు ధారపోయాలి జనం దీనికి అలవాటుపడిపోయారు. ఇది చాలా అవమాన కరం, అమానుషం. ఎక్కువమంది దీన్నిగురించి లోతుగా ఆలోచించలేరు. ఈ వ్యవ స్థలోని రాక్షసత్వాన్ని కొద్దిమందే తెల్సుకోగలరు.

సామ్యవాద సమాజంలో ఈ 'శాశ్వతవస్తువులు' పూర్తిగా మాయమవుతాయి. మిగతావాటికి అర్థాలే మారిపోతాయి. ఫలానవాడు పుట్టాడు, ఫలానవాడు చచ్చాడు అనేది ముఖ్యంకాదు. అంతకన్నా చెప్పుకోదగ్గ విషయాలు సమకాలిక సమాజంలో ఎన్నోవున్నాయి. వ్యక్తివాదులు దీనిని మెచ్చరు. కాని వ్యక్తివాదం (Individualism) చరిత్రలో కొట్టుకుపోయింది.

సాహిత్యంలో మూడోఅంశం చిత్రణ. ప్రజల పరస్పర సంబంధ బాంధ వ్యాలు, వైరుధ్యాలు, ఇష్టాయిష్టాలు అన్నీ ఇందులోకేవస్తాయి.

భాష, వస్తువు, చిత్రణ- ఈ మూడు అంశాలు సాహిత్య సమగ్ర స్వరూపాన్ని తెలియజేస్తాయి. కొందరు శైలి, సంవిధానంగురించికూడా చర్చిస్తారు. కాని అవి కేవలం రచయితల ప్రతిభకు సంబంధించినవి. ఆమాటకొస్తే ఈ ప్రతిభకూడా ఒక రకంగా సమాజంనుంచి రూపొందేదే.

మన యువరచయితలు సాహిత్య రచనలోని కష్టసుఖాలు తెల్సుకోవాలి. అంతే కాదు సమాజంపట్ల, పాఠకులపట్ల తమ బాధ్యతనుకూడా గుర్తించాలి.

జ్ఞానానికి సత్యం ఒక మెట్టు. పనిముట్టు. ఈ సత్యం మానవుడి శ్రమైక జీవనాన్నుంచే పుడుతుంది. మానవుడి సాంస్కృతిక అభివృద్ధి, దాని చరిత్రకూడా ఈ సత్యాన్ని వేనోళ్ళ చాటిచెప్పాయి.

నేనెప్పుడూ ఓమాటనుకుంటా- మన గమ్యం ఎంతగొప్పదయితే మన తెలివితేటలు, శక్తిసామర్థ్యాలు అంతబాగా ఫలవంతమవుతాయి అని.

జీవితాన్ని చిత్రించి, ప్రతిబింబించడమే సాహిత్యం చేయాల్సిన పని. సత్యాన్ని వివిధరకాల పాత్రల ద్వారా అవతరింపజేసి మన మనసుల మీద ముద్రవేయాలి. ఓ సామెతుంది "ఎత్తు ఎక్కిన కొద్దీ దూరం చూడగలుగుతాం."

నేను పచ్చి వాస్తవికవాదిని (Naturalist) కాదు. అంటే ఉన్నదున్నట్టే రాయాలనను. వాస్తవికతను అధిగమించాలి సాహిత్యం. ఉన్నతంగాచూడాలి సాహిత్యం. ఎందుకంటే సాహిత్యం కేవలం వాస్తవికతను ప్రతిబింబిస్తేచాలదు. అంతకన్నా ఎక్కువ ప్రయోజనముంది సాహిత్యానికి. ఉన్నవాటిని చిత్రిస్తేచాలదు. మనం ఏమి కావాలనుకుంటున్నామో, ఏమి సాధించగలమోకూడ గుర్తుంచుకోవాలి. మనకు తెలిసినవీ మనం చూసేవీ అన్నిటినీ కలిపి ఓ కొత్త తరహా పాత్రలను తయారుచేయాలి. చిన్న విషయాలయినా ప్రత్యేకమైనవాటిని తీసుకుని వాటినే గొప్పగా, చిక్కని తరహాలో మలచాలి. అది సాహిత్యం చేయాల్సినపని. మనసాహిత్యం అన్నిటినీ ఆవరించాలి.

అనువాదం : సి. ప్రసాద్

# విప్లవ సాహిత్యోద్యమం - కథలు II

మరువాడ రాజేశ్వరరావు

అభ్యుదయ సాహిత్యోద్యమంనాడు మధ్యతరగతి జీవితాన్నిచిత్రించిన కథలనేకం వచ్చేయి. వారి దృక్పథంలో మధ్యతరగతి వ్యక్తి ధనికవర్గాన్ని, దాని ఆర్థిక రాజకీయ వ్యవస్థని భరించలేని, ఎదిరించలేని బలహీనుడిగా సానుభూతి సంపాదించేడు. అతని సుఖశాంతులకి అడ్డుతగిలే శక్తుల్ని ఎదిరించడానికీ, అతని జీవితం (ఉన్న వ్యవస్థలోనే) మరింత విశాలం కావడానికి పనికొచ్చే భావాలని అభ్యుదయ కథకులు బలపరిచేరు.

---

మొదటి భాగం జూన్ సృజనలో వచ్చింది.

ఈనాడు వ్యాపార వార, మాస పత్రికల్లో వచ్చేకథలు భావగమనాన్ని వెనక్కి నెట్టడానికే ప్రయత్నిస్తున్నాయి. అభ్యుదయ సాహిత్యోద్యమంచేత దెబ్బతిన్న భావాలు కూడా ఈనాడు ఉధృతంగా ప్రచారమౌతున్నాయి. యిందుకు కొందరు మాజీ అభ్యుదయ రచయితల ఆశీర్వాదంకూడా ఉండడం చరిత్ర గమనించతగ్గ విషయం. యిందుక్కారణం ఈ నాడు బలపడుతున్న విప్లవశక్తుల్లోనేఉంది. బలపడుతున్న విప్లవ శక్తులకి కనిపిస్తున్న భవిష్యత్తు మధ్యతరగతి భయానికి కారణమైంది. వారిదృష్టి భూత కాలంవైపు తిరిగింది. వారి విలువలు మత సంబంధమైన మూఢత్వానికి చెందినవి. వారి సాహిత్యం సమకాలీన జీవిత వాస్తవాన్ని చూపించదు.

ఈ పరిస్థితుల్లో, విప్లవ శక్తులకి ప్రతినిధిగా విప్లవ సాహిత్యం ఉద్యమరూపం తీసుకుంది. విప్లవ రచయితలు మధ్యతరగతి జీవితాన్నీ, జీవితపు విలువలనీ, రాజకీయ చైతన్యాన్నీ విశ్లేషించే కథలురాసేరు.

ప్రభువర్గానికీ, ప్రజలకీ మధ్య వైరుధ్యం పోరాటస్థాయిని చేరుకున్నప్పుడు, ప్రభువర్గం వారి కార్యాకలాపాలు నిర్వహించే మధ్యతరగతివర్గం రాజకీయంగా ఎటువంటి పాత్ర నిర్వహిస్తుందో, అందుకు కారణాలేమిటో చెప్పేకథ రా. వి. శాస్త్రిగారి 'వేతనశర్మ కథ'.

మధ్యతరగతి వర్గానికి వేతనశర్మ నాయకుడు. "సమాజం పూర్తిగా మారితేనే కాని జీవితాలు బాగుపడనివాళ్ళు చాలామంది" ఉన్నారని అతనికితెలుసు.

"సమాజం ఇలానే ఉన్నప్పటికీ మనకి బాగుపడే అవకాశాలున్నాయి", అని కూడా అర్థంచేసుకున్నాడు. ఈ రెండు విషయాలూ యింత స్పష్టంగా అర్థం చేసుకున్నాక తన వర్గానికి కావలసినవి వేతనాలేకాని, విప్లవంకాదనే విషయం స్పష్టంగా బోధపడింది.

"మమ్మల్ని మీరు పెంచండి. మిమ్మల్ని మేం దించం అని ప్రభువులతో చెప్పినట్లయితే వారు నమ్ముతారని"కూడా అతనికి నమ్మకం కలిగింది. అధికారం ఉంటుందో ఊడుతుందో అన్నట్టున్న క్లిష్ట సమయంలో వేతనశర్మ నమ్మకం నిరాధారం కాదు. విప్లవానికి వెన్నుపోటు పొడవడం వేతనశర్మ దృష్టిలో తప్పుకాదు, అది అతని వర్గ ధర్మం.

వేతన శర్మోపన్యాసం ఈనాటికీ ప్రభుత్వోద్యోగులకి శిరోధార్యమైందని చెప్తారు రచయిత. అందుక్కారణం ఉంది. పాలకవర్గానికీ మధ్యతరగతి జనానికీ మధ్యఉండే ఆర్థిక, రాజకీయసంబంధాల్లో కథకీ, వాస్తవ పరిస్థితులకీ అట్టే తేడాలేదు. వేతన పోరాటాలే పరమధర్మంగా అనుసరించేవారికి ఈ కథ నచ్చలేదు. మరీమంచిది!

ప్రజా పోరాటం ఆగకుండా కొనసాగితే, పాలకవర్గంవారు వేతనాలు పెంచ డానిక్కూడా అశక్తులైపోతారు. వాస్తవ జీవితంలో అటువంటి పరిస్థితి వచ్చేవరకూ 'వేతనశర్మకథ'. మధ్యతరగతి రాజకీయ ప్రవర్తనకి తిరుగులేని రూపకల్పనగా ఉండి పోతుంది.

పులుల్లాగ కనిపించేవన్నీ నిజంగా పులులుకావు. మనం భయపడినంతకాలం కొందరు నిజమైన పులుల్లాగే ప్రవర్తిస్తారు. గట్టిగా ఎదిరిస్తే, వాళ్ళు కాగితంపులులే అని తేలిపోతుంది. ఈ విషయం, ఎన్.ఎస్ ప్రకాశరావు 'పేపర్ టైగర్' కథచెప్తుంది.
ఆస్తినీ, అంతస్తునీ, పలుకుబడినీ, అధికారాన్నీ చూసి భయపడే ప్రసాదరావుకి నరసింహంగార్ని చూస్తే పెద్దపులిని చూచినంత భయం.

మనిషి ప్రాణంకన్నా, మనుగడకన్నా, 'ఆస్తిహక్కు'కి ఎక్కువ విలువనిచ్చే వాళ్ళందరి గుండెల్లోనే తుపాకీగుండులాగ దూసుకుపోయే చొరవగల 'ముష్టిపిల్ల',కథ లోకి గాలివానలాగ తలుపుతోసుకుని ప్రవేశించడంతో నరసింహంగారు వట్టి కాగితప్పులే నని తేలిపోతుంది.

నరసింహంగారిలో పులి లక్షణాలు లేవనికాదు. ఆయన ఆస్తిపాస్తులు సంపా దించడానికి అవలంబించిన వృత్తి 'న్యాయవాది'. న్యాయవాదిగా ఆయన, అది "ఖూనీ కేసుకానీ, ప్రోనోటు కేసుకానీ, పార్టీవచ్చి- బాబూ రక్షించు అని అడిగితే, 'అబ్బే, ఇంతవుతుంది' అని ఖరాఖండీగా 'వెల' కడతాడు.

"ఆ చచ్చిపోయినవాడికి వీడిచేతిలో చావ్వలిసుండి, వీడికి చంపాలిసుండి, వీడు బతంవలిసుండి మన దగ్గిరికి రావలిసున్నప్పుడు".... 'మధ్యలో మనమెవళ్ళం' అనే తత్వం అనుసరించి ఖూనీచేసినవాడ్నికూడా రక్షించి భక్తితో భగవంతుడికి మొక్కుతా డాయన. రక్తంలో తడిసినడబ్బు తెచ్చేది రక్తపుకూడు. రక్తపుకూడుతినేది పెద్దపులి.

ఈ కథలో, నరసింహంగారు పులుల్లో ఎలాచేరేదో చెప్పడం ఒకెత్తూ, ఆ పులి కేవలం కాగితప్పులే అని తెలియచెప్పడం చాలా పెద్దఎత్తు. అధికారవర్గం అండకలిగి నన్నాళ్ళూ నరసింహంగారిలాంటివాళ్ళు భయంకరమైన పెద్దపులుల్లాగే కనిపిస్తారు. ఆ అండనించి ఒక డ్రెమెటిక్ సిట్యుయేషన్‌లో ఆయన్ని ఒక్క క్షణం తప్పించి, సర్ప్రైజ్‌చేసి, అసలు స్వరూపాన్ని బైటపెట్టడం చాలానేర్పుతో కూడుకున్నపని.

పులి లక్షణాలు ఎవరికీ పుట్టుకతోరావు. సామాజికవ్యక్తిగా రూపులేసుకోక ముందు- అన్యాయాన్ని చూసినప్పుడు, పేద ప్రజలనుభవించే కష్టాలూ, బాధలూ, తెలిసినప్పుడు మానవత్వంతో ప్రవర్తించడం సహజం. సామాజికవ్యక్తిగా ప్రవర్తించి

నప్పుడు వర్గస్వభావం ముందుకొచ్చి మానవత్వపు విలువల్ని తారుమారుచేస్తుంది. ఈ విషయం 'శుక్లతోక' కథ చెప్తుంది.

రాంబాబు జీవితం వడ్డించిన విస్తరిలాంటిది. అతని అనుభవంలోను, ఆలోచనలోను పేదరికానికి చోటులేదు. ఒకరోజు కాకతాళీయంగా జరిగిన కొన్ని సంఘటనల కారణంగా పేదవాళ్ళ బతుకులతో, బాధలతో కొన్నిగంటలు ప్రత్యక్షమైన అనుభవం కలుగుతుంది. ఆ అనుభవం అతన్ని కొంతవరకూ కదిలిస్తుంది. అతని సామాజిక వాతావరణంలో ఆ 'కదలిక' యిమడదు 'పులి' కాదల్చుకున్నవాడు మేకలమీద జాలి పడకూడదు.

ఈ 'పోటీ'ల వ్యవస్థలో, ఉన్నకొద్ది అవకాశాలనీ అందుకోగలిగేవాళ్ళు కొద్దిమందే ఉంటారు. మధ్యతరగతి వ్యక్తుల్లో చాలాభాగం, అవకాశాలకోసం జరిగే పోటీలో అడుగడుగునా ఓడిపోతూ ఒకోమెట్టూ కిందికిదిగి భౌతికంగా పేదవర్గంలో కలిసిపోయినప్పటికీ వాళ్ళ వెనకటి చరిత్ర, వెనకటి సంస్కారం, వెనకటి నమ్మకాలు, వెనకటి అహంభావం, వెనకటి గుత్తాధికారాలవల్ల తయారైన మానసిక స్థితి, వెనకటి భావాలు పూర్తిగా పోవు. ఈరకమైన మానసిక స్థితిలో ఉన్నంతకాలం వాళ్ళెందుకూ పనికిరారనే సూచన 'ఏమౌతావ్' కథలో కనిపిస్తుంది. ఆకాశానికి ఆశల నిచ్చెనలు వేసుకున్న సుదర్శనం; తండ్రి ఆర్థికంగా చితికిపోవడంతో, కూలిపనికే సిద్ధపడవలసి వస్తుంది. అతని చదువు, సంస్కారం, అతన్ని కూలిపనికి పనికిరాకుండా చేసేయి. 'నువ్వెందుకూ పనికిరావ'ంటాడు కళాసి.

జనంలో రాజకీయ చైతన్యం వివిధ దశలలో ఉంది. ఈ చైతన్యాన్ని చిత్రించే కథలు కొన్ని, విప్లవ కథకులు రాసేరు.

పి. యస్. రావుగారి 'బంగారమ్మ కమతం' కథలో ఊరంతటికీ పెద్ద కమతం బంగారమ్మది. భీముడి తండ్రి, తరవాత భీముడు కష్టపడి ఆ కమతాన్ని పెంచేరు. బంగారమ్మ మొగుడు పోయేడు. ఒక కొడుకు తప్ప యింకెవరూ లేరు. భీముడి అండ లేకపోతే తన కమతం జరగదని ఆమెకి తెలుసు. వయసొచ్చిన భీమయ్య పెళ్ళి చేసుకోవడం సహజమే మరి? అది బంగారమ్మకి సమస్యెలాగౌతుంది? శ్రామికుల జీవితాలు కామందుల ఆర్థిక వ్యవహారాలు. సంసారం, బరువు బాధ్యతలు నెత్తిమీదపడి భీమయ్యకి ఒక జీవితం అంటూ ఏర్పడితే, చేసే పనిలో వెనకటి శ్రద్ధ చూపించక పోవచ్చు. అతనికి సంసారం అంటూ ఒకటి లేకపోతే జీవితాంతం, రాత్రింబగళ్ళు బంగారమ్మ కమతంలోనే శ్రద్ధగా పనిచేస్తాడు. అదే ఆలోచనతో భీమయ్య భార్యని, నేరం తన నెత్తిమీదికి రాకుండా— పరలోకానికి పంపేసే ఉపాయం ఆలోచించింది. ఆమె ఉపాయంవల్ల సీతాలు (భీమయ్య భార్య) మరణించింది. ఈ 'కుట్ర' తెలిసిన భీమయ్య బంగారమ్మ చెరుకు తోటని నాశనంచేసి, కమతం వదిలేసి వెళ్ళిపోతాడు.

సీతాలు చావుకి దారితీసిన జీవిత పరిస్థితుల్లోనూ, బంగారమ్మ దురూహల్లోనూ అవాస్తవికత లేదు. కాని, ఆ రెంటికీ వేసిన లంకె చాలా బలహీనమైనది. అయితే, ఈ కథలో భీమయ్య చైతన్యస్థాయి గమనించ తగ్గది. అతని దృష్టి, తన భార్య మరణించిన పరిస్థితులమీదికి పోలేదు. రక్తమాంసాలులేని, కళ్ళకి కనపడని వ్యవస్థ అతని ఊహకి అందలేదు. ఎదురుగా కనిపించిన బంగారమ్మనే సీతాలు చావుకి కారణంగా ఊహించగలడు. సీతాలుచావుకి కారణమైన తన జీవితపరిస్థితులకి మూలం తన శ్రమ దోచుకునే బంగారమ్మ అయినప్పటికీ ఆ దృష్టితో అతడు చూడలేకపోయేడు. అతని దృష్టిలో బంగారమ్మ చేసిన నేరం అంతా ఆ రాత్రి జరిగిన సంఘటనకే పరిమితం. అన్నేళ్ళు శ్రమించిన కమతాన్ని వదిలేసి వెళ్ళిపోవడంలో నిరాశ, నిస్పృహ కనిపిస్తాయి కాని, అంతవరకూ, శ్రామికుడిగా తనకు జరిగిన అన్యాయంపట్ల తిరగబడి తన కష్టఫలం మీద తన హక్కు ప్రకటించుకునే చైతన్యం కనబడదు.

బి. టి. రామానుజం 'మర బ్రతుకులు' కథలో, బస్సు ఓనర్ల మధ్య పోటీ బస్సు కార్మికుల మధ్య యుద్ధంగా పరిణమిస్తుంది. ఓనర్లకి సంబంధించినంతవరకూ అది 'ఆరోగ్యకరమైన పోటీ' (Healthy competetion!) వర్కర్లు ఎల్లవేళలా ఓనర్ల లాభాలు పెంచేందుకే కృషి చెయ్యాలి. పెట్టుబడిదారీ వ్యవస్థలోని పెద్దలంతా ప్రతి రోజూ వర్కర్లకోసం చెప్పే గొప్ప నీతి!

ఓనర్ల లాభాలు పెంచడం కోసం వర్కర్లు కొట్లాటలతో 'పగ'లూ, ద్వేషాలూ పెంచుకుంటారు. ఓనర్ల జులుంమీద, అన్యాయం మీద కత్తికట్టిన బస్సు కార్మికుడు సూరి. వర్కర్లు, ఓనర్లకోసం కొట్టుకుంటున్నారనే చైతన్యం అతనిలో కనిపిస్తుంది. వర్కర్ల నాయకుడిగా చలామణి అవుతున్నవాడు ఓనర్లతో లాలూచీ అయి వర్కర్ల చైతన్యాన్ని నీళ్ళుకార్చడానికే ప్రయత్నిస్తాడు. కాని, సూర్యం తలవంచదల్చుకోలేదు. అతనిలోని చైతన్యం రాజుకుంటున్న నిప్పు- తెలతెలవారుతున్న వెలుగు!

(సశేషం)

---

సమీక్షా వ్యాసం :

# మార్క్సిస్టు తత్వశాస్త్రం

విరసం ఉద్భవించిన కొత్తలో విప్లవ రచయితలు మార్క్సిస్టులు కానవసరం లేదనీ, అనుభవంనుంచి విప్లవ రచనలు రావచ్చుననీ ఒక వాదం వెలువడింది. దీని వెనకఉన్న మనస్తత్వాన్ని మూడు దశాబ్దాల చిల్లర క్రితమే డేవిడ్ గెస్ట్ ఖండించాడు.

"అనుభవం చాలదా? సిద్ధాంతం దేనికి?" అనే వారు శ్రామిక వర్గంలోనే ఉండటాన్ని అతను తప్పుపట్టి "సిద్ధాంతం కార్యకర్తకు అడుగడుగునా అవసరమే" అన్నాడు. ఏమిచేసి ఏ ఫలితం సాధించాలన్నా ఒక సార్వత్రిక సూత్రాన్ని ఆధారం చేసుకోవాలి. ఇలాంటి సార్వత్రిక సూత్రాలే చేరి సిద్ధాంత మవుతాయి. అనుభవంద్వారా రుజువైన సిద్ధాంతం శాస్త్రీయ సిద్ధాంతం అనిపించుకుంటుంది.

సిద్ధాంతమూ, అనుభవమూ పరస్పరాధారంగలవి. శాస్త్రజ్ఞానమంతా అనుభవం నుంచిపుట్టి, అనుభవాన్ని విస్తరించుతూ దానిద్వారా పెరుగుతూవచ్చినదే. సిద్ధాంతమూ అనుభవమూ అనేవి వైరుధ్యాలు. అవి విడదీయరానివి. "వైరుధ్యాల ఐక్యత" అన్నది గతితార్కిక భౌతికవాదానికి వెన్నెముక.

అయితే వర్గసమాజంలో— ముఖ్యంగా బూర్జువా సంస్కృతిలో— అనుభవసిద్ధాంతాల ఐక్యత గుర్తించబడదు. బూర్జువా ప్రపంచ దృక్పథం శాస్త్రజ్ఞానంతో సమాజ స్వభావాన్ని అవగాహన చేసుకునే వైఖరిని సహించదు; ఎందుకంటే అలాంటి అవగాహన విప్లవస్వభావం కలిగిఉంటుంది. బూర్జువాసంస్కృతిలో అంతో ఇంతో మతదృష్టి ఉంటుంది; పదార్థంకన్న మనస్సు, "ఆత్మ" ప్రాముఖ్యం వహిస్తాయి; పెట్టుబడీదారీ దశ చిరస్థంగా ఉండాలన్న ఆరాటం ఉంటుంది.

ఈ సంస్కృతి శ్రామికవర్గశత్రువు. ప్రపంచాన్ని భౌతికదృష్టితో చూడటమూ, దానిలోకలిగే విప్లవ పరిణామాలను గ్రహించటమూ గతితార్కిక భౌతికతత్వం చేసేపని. అదే శ్రామికవర్గ దృక్పథం.

"సిద్ధాంతంగా బాగానే ఉండవచ్చు, కాని ఆచరణలో సాధ్యంకాదు" అన్నమాట అర్థంలేనిమాట, ఆచరణలో రుజువైనదే సిద్ధాంతం. బూర్జువా సంస్కృతిలో ఆచరణకూ, సిద్ధాంతాలకూ పొంతనలేకుండా పోయిన కారణంగా యిటువంటి మాటలు పుట్టుతాయి.

శాస్త్రీయ సామ్యవాదం శ్రామికోద్యమానికి ప్రాతిపదిక. అన్ని శాస్త్రాల దృక్పథాన్నీ యిది పరిగ్రహిస్తుంది. మానవ సమాజం మొదలుకొని ప్రతిదాన్నీ శాస్త్రీయ దృష్టితో అర్థంచేసుకుంటుంది. అందునా బూర్జువా తత్వంతో దీనికి ఘర్షణ తప్పదు. ఈ ఘర్షణ స్వరూపం ఆధునికమైనా స్వభావం ప్రాచీనమే. మన పూర్వులలోనే ప్రకృతివాదమూ, ఆధ్యాత్మికవాదమూ ఘర్షణపడ్డాయి, (ప్రకృతివాదంనుంచి శాస్త్రవిజ్ఞానమూ, ఆధ్యాత్మికవాదులనుంచి ఈశ్వరుడూ, ఇహపరవిభజనా, కర్మసిద్ధాంతమూ పుట్టుకు రావటం యాదృచ్ఛికంకాదు.) ఆధ్యాత్మికవాదం అనేది చేసేది ఏమంటే, భౌతికకారణాలవల్ల కలిగే పరిణామాలకు అలౌకికకారణాలు ఆపాదించటం. దీనివెనక మతదృష్టి ఉంటుంది. ఆధ్యాత్మికవాదుల దృష్టిలో భౌతిక ప్రపంచం యొక్క అస్తిత్వమే అనుమానాస్పదం. దాన్ని గురించి మనకు నిజంగా ఏమీ తెలీదు। తెలుసుననుకునేదంతా భ్రమ.

అయితే ఆధ్యాత్మికవాది జీవించేది భౌతిక జీవితమే. ఆకలి అన్నం తింటే పోతుందని తెలుసు; వానలో తడవకుండా గొడుగు పట్టుకోవాలని తెలుసు. మొండి కత్తికి పదును పెట్టించాలని తెలుసు. రైతులూ, కూలీలూ పొలాలలోపడి గొడ్లలాగా పనిచేస్తేనేగాని పొయిలోపిల్లి లేవదని తెలుసు. అయితే ఈ ఆధ్యాత్మికవాది ఆధిక్యత ఎక్కడ వున్నదంటే తనను పోషించేవారి శ్రమను చిన్నచూపు చూడటంలో ఉన్నది; తాను తనలాభ క్షేమాలకొరకు వినియోగించే శాస్త్రజ్ఞానాన్నే తిరస్కరించి తానుకూర్చున్నకొమ్మనే నరుక్కునేవాడి మనస్తత్వం ప్రదర్శించటంలో ఉన్నది। ఆధ్యాత్మికవాదులు బుద్ధిని పైకెత్తి, శరీరశ్రమను చిన్నచూపుచూస్తూనే మహామేధావులైన శాస్త్రవేత్తలు కని పెట్టే శాస్త్రజ్ఞానాన్నికూడా ప్రతిఘటిస్తారు. ఆధ్యాత్మికదృష్టి హేతుబద్ధంగా వుండటానికి వీల్లేదు.

ఆధ్యాత్మికవాదులకు వాస్తవమైనపునాదిలేదు "ఈశ్వరసత్యం జగన్మిథ్యా" అన్న ప్రాతిపదికమీద వారు ఆధ్యాత్మికవాదాన్ని నిర్మించారు. జగత్తుమిథ్య అన్న విశ్వాసానికి ఆధారం ఏమిటి? జగత్తు వాస్తవమే అనుకుని దానిమీద మేధాశక్తితో సిద్ధాంతాలుచేస్తూ పోతే నిజమైన భౌతికవాదం రూపొందుతుంది, జీవంకన్న మరణమే మేలన్న ప్రాతిపదికమీద జీవితసత్యాలు పుట్టుకురావుగదా.

మన జ్ఞానేంద్రియాలు భ్రమలుకలిగిస్తాయన్నది ఆధ్యాత్మికదృష్టిని నిరూపించదు. శాస్త్రవేత్త ఆ భ్రమలు ఏ కారణాలవల్ల కలుగుతాయో, వాటివెనక "సత్యం" యెలా ఉంటుందో భౌతికదృష్టితోనే అన్వేషిస్తాడు, కామెర్లరోగికి లోకం పచ్చగా కనపించటం భ్రమే. అంత మాత్రంచేత ప్రపంచం మిథ్యకాదు. పచ్చగా కనిపించే ప్రపంచం వెనకఉన్న కామెర్ల రోగానికి చికిత్సచేస్తే ఆ భ్రమ పోతుంది. అన్నీ రోగ సంబంధ

మైన భ్రమలేకావు- అనేక భ్రమలు ప్రకృతిసిద్ధమైనవి మన జ్ఞానేంద్రియాల నిర్మాణం వాటికిగల పరిమితులు, అనేక భ్రమలు కలిగిస్తాయి. అవి ప్రకృతిసిద్ధమైనవి అన్న తరవాత ఈశ్వరుణ్ణి చర్చలోకి తేనక్కరలేదు; ఆ భ్రమలకు భౌతిక కారణాలే దొరుకుతాయి.

"జగత్తే మన దత్తాంశం (డేటమ్). అది మనకు ప్రసాదితం. అది ఉన్నది. అదే మన నిత్య ప్రపంచం, మన సమానుభవం (కామన్ ఎక్స్పీరియన్స్) అందులో పరిణామాలు జరుగుతాయి." అన్నాడు ప్రొఫెసర్ లెవీ.

ఇలాటి వైఖరి ఆత్మ విధ్వంసకమైనది కాకపోగా హేతుబద్ధమైనదికూడా.

అసలు ఈ ఆధ్యాత్మిక వైఖరి అనేది ఎలా వచ్చింది? అవకతవక దృక్పథాలకు కూడా కారణాలుంటాయి భౌతికవాదానికీ, ఆధ్యాత్మికవాదానికీ అంతులేని సంఘర్షణ జరిగింది, జరుగుతున్నది. ఇది కేవలమూ భావ సంబంధమైన సంఘర్షణ కాదు. (అల్పాయుష్కుడైన శంకరుడు సాంఖ్యంతోనూ, చార్వాకంతోనూ చాలా ఘర్షణపడ్డాడు. చిట్టచివరకు సాంఖ్యానికీ ఆధ్యాత్మిక వాదానికీ పొసగనిలంకె కృత్రిమంగా తగిలించారు.) ఇలాటి సంఘర్షణలు ఆకాశం నుంచి ఊడిపడవు. ఈ సంఘర్షణ వర్గ సమాజం నుంచీ వర్గ పోరాటం నుంచీ పుట్టింది, వర్గ పీడనకు ఉపయోగపడుతున్నది. లేకపోతే వర్గ పీడనలోనూ, వర్గ సంబంధాలలోనూ ఉన్న సాంఘిక దురన్యాయాన్ని సమర్థించటం ఎలాగ? ఉత్పత్తిమీద ఆధారపడిన సమాజంలో ఉత్పత్తిచేసే వాళ్ల హీనులనీ, చెయ్యీ కాలూ కదల్చకుండా అందలాలెక్కి తిరిగేవాళ్లు ఉన్నతులనీ వాదించటమెలాగ? పెట్టుబడిదారీ సమాజానికి కూడా ఈ ఆదర్శవాదాన్ని ఆసరాచేసుకోక తప్పలేదు. చిత్రమేమిటంటే, పెట్టుబడిదార్లు అందుబాటులోఉన్న శాస్త్రవిజ్ఞానాన్ని పుష్కలంగా వినియోగించుకుంటారు. శ్రామిక వర్గాన్ని మరింత క్షీణదశకు తీసుకురావటానికి ఆటోమేషన్‌లాటి సాంకేతిక ప్రక్రియలకు వారికి అభ్యంతరంలేదు. కాని వారికి భౌతిక తత్వవాదం సరిపడదు. పెట్టుబడిదారీలో ఉన్న సాంఘిక వైరుధ్యాలలో ఇది కూడా ఒకటి.

ఉత్పత్తిచేసే శ్రామికుడికి ఈ ఆధ్యాత్మిక వాదం ఎందుకూ పనికిరాదు. దున్నేవాడూ, వడ్రంగం చేసేవాడూ, లేత్‌మీద పనిచేసేవాడూ, యంత్రాలు తయారుచేసేవాడూ వచ్చి భౌతికవాదులుగానూ, నైపుణ్యంపై ఆధారపడిన వారుగానూ మాత్రమే పనిచెయ్యగలరు. వాళ్లకు ఈశ్వరుడు లీలలను గురించి, పూర్వజన్మ తాలూకు పుణ్యపాపాల గురించీ, లలాట లిఖితాలను గురించీ చెప్పాలంటే తీరికవేళలలోనే సాధ్యం; ఈ ఉచ్చులనుంచి బయటపడాలంటే శ్రామికవర్గం భౌతిక వాదానికి పరాకాష్ఠ అయిన మార్క్సిజమును అవలంబించాలి. అది ప్రపంచ కార్మికుల సొంతం.

